# మన ప్రసిద్ధ పుణ్య క్షేత్రాలు

రచన

ఇలపావులూరి పాండురంగ రావు

చిత్రాలు

డి.కె.దాస్



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

ISBN 81-237-2217-6

ప్రథమ ముద్రణ 1997 (శక 1919)



Mana Prasiddha Punya Kshetralu (*Original Telugu*)

(Our Places of Religious Interest)

**రూ. 10.00**

డైరెక్టర్, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5, గ్రీన్ పార్క్,
న్యూఢిల్లీ - 110 016 ద్వారా ప్రచురింపబడినది.

## విషయ సూచిక

# 1. మనదేశం మన సంస్కృతి

మనదేశం భారత దేశం. ఈ దేశంలో ఎందరో మహానుభావులు ఉదయించారు. కవులు, గాయకులు, కళాకారులు, పండితులు, ప్రవక్తలు, ప్రజాపాలకులు, నీతికోవిదులు, శాస్త్రజ్ఞులు, యోగులు, త్యాగులు ఎందరో తమ ప్రతిభను ప్రజల అభ్యుదయం కోసం వినియోగించి ఈ దేశానికి మంచి పేరు తెచ్చారు. ఏ కాలంలో ఎక్కడెక్కడ ఎవరెవరు ఇలాంటి మంచి పనులు చేశారో మన చరిత్ర మనకు చెప్తుంది. వాటికి నిదర్శనం మనదేశంలోని పుణ్యక్షేత్రాలు. ఇక్కడి పర్వతాలు, నదులు, పల్లెలు, పట్టణాలు గుళ్ళు, గుహలు, కట్టడాలు, ఆనకట్టలు, విద్యాలయాలు, మత సంస్థలు ఆ మహనీయులు చేసిన సత్కార్యాలను చాటి చెప్తాయి. ఆ కృషివల్ల దేశం సాధించిన ఘనతను చూచుకుని ఇక్కడి నదులు ఆనందంతో గానం చేస్తాయి. సముద్రాలు తరంగకాలక్షేపం చేస్తాయి. కొండలు నిండు మనస్సుతో దేశానికి అండగా నిలబడి ఉంటాయి. ఈ సాంస్కృతిక వైభవాన్ని కేవలం విని ఆనందించటమే కాక కన్నుల పండువుగా చూచి అర్థం చేసుకోవటం కూడా అవసరం. అందుకే తీర్థయాత్రలు, పుణ్యక్షేత్ర సందర్శనాలు మన జాతీయ కార్యకలాపాలలో చోటు చేసుకున్నాయి.

భారత దేశం ప్రపంచంలోని గొప్ప గొప్ప దేశాలలో ఒకటి. అంతే కాదు, ఆధ్యాత్మిక రంగంలో మన దేశానికి ఒక విశిష్టమైన స్థానం ఉంది. వేదకాలం నాటి ఋషివాక్కులు ఈ నాడు కూడా

నస్వరంగా విన వస్తున్నాయి. పాపపుణ్యాలను గురించి, త్యాగ భోగాలను గురించి, జీవిత పరమార్థాన్ని గురించి మన దేశంలో మహర్షులు చాలా మననం చేసి వాటి సారాన్ని జీవకోటికి అందజేశారు. మానవసేవ ద్వారా మాధవ సేవ ఎలా చెయ్యాలో విశదంగా చెప్పారు. ఆత్మదర్శనం ప్రతి జీవికీ సాధ్యం అని చాటి చెప్పారు. ఈ సాధనకు ధర్మం, అర్థం, కామం ఎలా సహకరిస్తాయో కూడా కనుగొని జీవిత విధానంలో ఒక విధమైన సమన్వయం, సామరస్యం, సాధించి బోధించారు. స్వార్థబుద్ధిమాని పరమార్థం కోసం ప్రయత్నిస్తూ తోటి మానవులను కూడా ఆత్మీయతతో చూడటమే మానవధర్మం, ఈ ధర్మాన్ని పటిష్ఠం చేసేందుకు మన పుణ్యక్షేత్రాలు దోహదం చేస్తున్నాయి. తీర్థయాత్రలలోని పరమార్థం ఇదే. 'తీర్థం' అనే మాటకు తరింపచేసేది అని అర్థం. తాను తరించి ఇతరులను తరింప చేయుటమే సంఘజీవి అయిన మానవుని కర్తవ్యం. అప్పుడే మనదేశం కర్మభూమి, పుణ్యభూమి అనిపించుకుంటుంది.

భారతీయుల జన జీవనంలో భావసమైక్యం పెంపొందించేదుకు కూడా తీర్థ యాత్రలు చాలా సహకరిస్తాయి. రాకపోకల సౌకర్యం లేని రోజుల్లో కూడా కాశీనుండి రామేశ్వరం ప్రజలు కాలినడకనే పయనించేవారు. ఆది శంకరాచార్యులు కాలినడకనే కాలడినుండి దేశం నలువైపుల సంచారం చేసి అద్వైతసిద్ధాంతాన్ని అందరికీ బోధించారు. గత శతాబ్దంలో స్వామి వివేకానందులకు ఆత్మజ్యోతి సాక్షాత్కరించింది మూడు సముద్రాలు కలిసే కన్యాకుమారి సాన్నిధ్యం లోనే. మన దేశంలోని మత ప్రవక్తలందరూ తీర్థయాత్రల ద్వారానే ప్రజాసామాన్యానికి పరమార్థం బోధించారు. సంఘజీవితంలో కూడా అనేక భాషలు మాట్లాడే ప్రజానీకం కుల, మత, భాషా భేదాలను మరిచిపోయి పుణ్యక్షేత్ర సందర్శనంలో భారతీయ సంస్కృతిని ప్రత్యక్షంగా చూచి

అవగాహనం చేసుకుని సమరస భావంతో జీవించేందుకు అలవాటు పడతారు. భారతీయత అంటే ఏమిటో అర్థమవుతుంది. ప్రయాణసౌకర్యాలు ప్రచురంగా లభించే ఈ రోజుల్లో దేశవాసులు ఇలాంటి పర్యటనలు సులభంగా చేయగలరు. కాని శ్రద్ధాభక్తులు అవసరం. దానితో పాటు ఆధునిక దృక్పథం, సమరస భావం సమ్మిళితమైతే పుణ్యక్షేత్రాలు ప్రజ్ఞా పీఠాలుగా రూపొందగలవు.

# 2. కాశీ-రామేశ్వరం

మన దేశంలోని పుణ్యక్షేత్రాలలో కాశీ రామేశ్వరాలకున్నంత ప్రాశస్త్యం మరి వేటికీ లేదని చెప్పవచ్చు. ఈ రెండింటికీ గల పరస్పర సంబంధం కూడా దీనికి కారణం కావచ్చు. కాశీయాత్ర చేసిన ప్రతి యాత్రికుడూ రామేశ్వరం కూడా వెళ్ళి అక్కడ కాశీగంగతో రామలింగేశ్వరస్వామికి అభిషేకం చేసి తన జన్మతరించినట్టు భావిస్తాడు. దక్షిణ దేశంలోని ఆస్తికులకు కాశీయాత్ర ఎంత పవిత్రమయిందో ఉత్తర దేశస్థులకు రామేశ్వరం కూడా అంతటి మహత్తర మయిన పుణ్యక్షేత్రం కైలాస వాసి అయిన శంకరుడు కాశీపై మమకారంతో విశ్వనాథుడిగా అక్కడ నెలకొంటే, శివస్వరూపుడైన శ్రీరామచంద్రమూర్తి సేతుబంధనం చేసిన సంగమస్థలంలో రామలింగేశ్వరుని ప్రతిష్ఠించి ఆ ప్రక్కనే హనుమంతుడు కైలాసం నుంచి తెచ్చిన విశ్వేశ్వరుణ్ణి కూడా స్థాపించి పూజించాడు. పూజావిధానంలో తొలిపూజ విశ్వేశ్వరలింగమూర్తికి, తర్వాత రామలింగేశ్వరస్వామికి. ఉత్తర దక్షిణాలను సంస్కృతికంగా, ఆధ్యాత్మికంగా, సాంఘికంగా కలిపిన పుణ్యక్షేత్రాలు కాశీరామేశ్వరాలు.

దేవతలకు ఆలయమని పేరెన్నికగన్న హిమాలయంలో శంకర జటాజూటం నుంచి దిగివచ్చిన గంగా భవాని కూడా తన శంకరుడికి ఇష్టమైన కాశీవైపే ప్రవహించి అక్కడ విశ్వనాధుడు కనిపించగానే ఒక్కసారి ఉత్తరం వైపుతిరిగి చూస్తుంది. అటు కైలాసాన్నీ, ఇటు కాశీని సరస నయనాలతో చూచే రసమయి భాగీరథి ఇక్కడ ఉత్తర వాహిని కావటం గొప్పవిశేషం. ఇది

చూచి వరణ, అసి అనే రెండు ఉపనదులు కూడా గంగలో చేరుకుంటాయి. దానితో ఆమె వారణాసి లేక వారాణసిగా మారింది. ఆ క్షేత్రానికే తర్వాత ఆ పేరు వచ్చింది. కాశి, వారాణసి అన్న రెండు పేర్లూ ప్రాచీన కాలం నుంచి ప్రచారంలో ఉన్నప్పటికీ కాశీలో ఉన్న ఆత్మీయత మరోపేరులో కనిపించదు. ప్రకాశించేది కాశీ ప్రకాశింపచేసేది కూడా కాశీయే. తాను ప్రకాశిస్తూ ఇతరులను ప్రకాశింపచేయటం కాశీనగరం వేలకొలది సంవత్సరాల నుంచి చేస్తున్న జ్యోతిర్మయ సేవ. అందుకనే పన్నెండు జ్యోతిర్లింగాలలో కాశీరామేశ్వరాలకు ప్రధానమయిన స్థానం ఉంది.

కాశీపట్టణం ప్రపంచంలోని నగరాలలో అత్యంత ప్రాచీన మయినది. ఈ నాటికీ ఈ నగరం నిత్యనూతనంగా, సజీవంగా, ఆనంద నందనవనంలా ఉంటుంది. క్రిక్కిరిసిన సందుల్లో నుంచి ఎక్కడెక్కడి నుంచో వచ్చిన యాత్రికులు అడుగడుగునా అనుమానంతో ముందంజవేస్తుంటారు- ఇదేనా విశ్వేశ్వరాలయమని. ఆగొందుల్లోనే అన్నపూర్ణేశ్వరీ ఆలయం కనిపంచగానే అన్ని అనుమానాలూ తీరి 'అవును, ఇదే భూలోక కైలాసం'అని తృప్తిచెందుతారు. కంచి కామాక్షి, మధుర మీనాక్షి, కాశీవిశాలాక్షి- అని ఆ బాలగోపాలం స్మరించేమూర్తి త్రయంలోని విశాలాక్షి ఇంతచిన్నస్దలంలో ఒదుక్కుని ఉండి విశ్వమంతా విశ్వేశ్వరుడికి మిగిలించింది కాబోలు ననిపిస్తుంది. అష్టాదశ పీఠాల్లో ఒకటి విశాలాక్షిమందిరం. ఆమె ఆలయానికి ఎదురుగానే సాక్షివినాయకుడు, సూర్యనారాయణ, భైరవస్వామి, హనుమంతుడు కనిపిస్తారు. ఈ మూలస్థానంలో ఉన్న విశ్వనాథ మందిరం దేశం నలుమూలలనుంచి అసంఖ్య జనాన్ని ఆకర్షిస్తుంది. ప్రాచీన మందిరం క్రీ.శ.1670 లో ధ్వంసంకావటంతో ఇందూరు మహారాణి అహల్యాబాయి 1776లో స్వామికి పునః ప్రతిష్ఠచేసి మందిరాన్ని పునరుద్ధరించారు. ఆమెకు స్వామికలలో కనిపించి తన ఉనికిని

తెలియ జేశారట. ఏది ఎలా వున్నా విశ్వనాథ మందిరం కాశీ విశ్వేశ్వరుడికి చిర నివాసమయింది. వేల సంవత్సరాల నుంచి గంగా తీరంలో స్వామినిలయం నిలచివుంది.

మూల విరాట్టు విశ్వనాథ మందిరం కాక కాశీలో రమారమి రెండు వేల ఆలయాలున్నాయని ప్రతీతి. వీటిలో కొన్ని చాలా ప్రాచీనమైనవి. ఈ శతాబ్దంలో చాలా నూతన దేవాలయాలే కాక విశ్వవిఖ్యాతి చెందిన విద్యాసంస్థలు కూడా వచ్చాయి. మహార్షి లాంటి మదన మోహన్ మాలవ్య కాశీ హిందూ విశ్వవిద్యాలయాన్ని ఈ శతాబ్దం ఆరంభంలో నెల కొల్పారు. సంస్కృత భాషా వికాసానికి ప్రాచ్య విద్యా పోషణకు ఈ విశ్వవిద్యాలయం కళామందిరం. భారత కళాభవనం ఇందులో ముఖ్యంగా చూడవలసిన స్థానం. బిర్లాకుటుంబం స్థాపించిన విశ్వనాథ మందిరం కూడా ఈ విశ్వవిద్యాలయ పరిసరంలోనేఉంది. దుర్గాలయం తులసీ మానస మందిరం, జ్ఞానవాపి, ఆదికేశవ, బిందుమాధవ దేవాలయాలు తప్పక చూడవలసిన దివ్యక్షేత్రాలు.

గంగాస్నానం కాశీయాత్రలోని ప్రధానాంశం. అర్థ చంద్రాకారంలో ఉత్తర వాహినిగా ప్రవహించే గంగానదీ తీరంలో స్నానం చేసేందుకు దాదాపు 64 రేవులు ఉన్నాయి. వీటిని ఘాట్ లంటారు. వీటిలో ముఖ్యమైనవి దశాశ్వమేధ ఘాట్, మణికర్ణికా ఘాట్, హరిశ్చంద్ర ఘాట్, పంచగంగా ఘాట్, అసీఘాట్. ఈ అయిదు చోట్ల స్నానం చేసి కాశీపురిని ప్రదక్షిణం చేయటం పరిపాటి. కాశీలో మరణించిన వారికి మరి జన్మ ఉండదని నమ్మకం. అందుకని వార్ధక్యం ఇక్కడనే గడపి ఇక్కడనే మరణించాలని చాలా మంది ఇక్కడికి వస్తారు. ఎక్కడెక్కడో చని పోయిన వారి మృత దేహాలను ఇక్కడ దహనం చేస్తారు. హరిశ్చంద్ర ఘాట్ దీనికి ముఖ్యమైనది. సత్య హరిశ్చంద్రుడు

సత్యవాక్య పరిపాలన కోసం ఈ రేవులోనే కాటికాపరిగా పని చేశాడని పురాణాలు చెప్తాయి. ఇలాగే ప్రతి రేవుకూ ఒక పూర్వగాథఉంది, అసలు కాశీపట్టణమే ఒక పూర్వగాధాలవారి.

గౌతమబుద్ధుడు, చైనాయాత్రికుడైన హ్యూయాన్ సాంగ్, శంకర, రామానుజాచార్యులు, గీత గోవింద కర్త జయదేవుడు, చైతన్య మహాప్రభువు, గోస్వామితులసీ దాసు-ఎందరో మహాను భావులు ఈ పుణ్యక్షేత్రం దర్శించారు.

కాశీ కేవలం హిందూ మతానికే పరిమితమైన పుణ్యక్షేత్రం కాదు. బోధివృక్షం క్రింద తపస్సుచేసి పరిపూర్ణమైన జ్ఞానాన్ని పొందిన గౌతమ బుద్ధుడు పదయాత్రతో కాశీకి 10 కి. మీ దూరంలో ఉన్న సారనాథ్ చేరారు. అక్కడనే వారు తమ తమ బోధను ప్రారంభించారు. పాహియాన్, హ్యూయాన్ సాంగ్ ఈ స్థలాన్ని చూచి దీనిని గురించి తమ రచనలో గొప్పగా అభినందిస్తూ వ్రాశారు. ఎన్ని విదేశ దండయాత్రలు వచ్చినా కాశీలాగానే ఈ క్షేత్రం కూడా తన ఆధ్యాత్మిక తేజస్సును కాపాడుకుంది. అశోకుడు నిర్మించిన 70 అడుగుల స్తూపం ఇక్కడిదే. ఇందులోని అశోక చక్రమే మన జాతీయ పతాకంలో చోటు చేసుకుంది. రెండున్నర వెయ్యి సంవత్సరాల క్రితం ఇక్కడ నెలకొన్న స్తూపాలు, చక్రాలు, స్తంభాలు, ఆలయాలు బౌద్ధమతం కనుగొన్న పారమార్థిక సత్యాలను చాటి చెప్తాయి. ఈ దృష్టితో చూస్తే కాశీ సర్వధర్మ సమన్వయానికి పునాది వేసిన పునీత భూమి.

**రామేశ్వరం**

ఉత్తర భారతదేశా నికి కాశీ ఎలాంటిదో దక్షిణ దేశానికి రామేశ్వరం అలాంటిది. అయోధ్యలో అవతరించిన శ్రీరామచంద్రుడే దక్షిణ సముద్రతీరానికి వెళ్ళి కైలాస వాసిని అక్కడ లింగమూర్తిగా ప్రతిష్ఠించటం ఈ క్షేత్రంలోని మహిమకు నిదర్శనం. కోటి నదులు. మూడు సముద్రాలు కలిసి మెలిసి

కైవల్యగానం చేసే యీ పుణ్యక్షేత్రం భారతీయ సంస్కృతికి, ఆధ్యాత్మిక చైతన్యానికి ప్రాకృతిక సంగమస్థలం. మన దేశంలోని నాలుగు ప్రసిద్ధ సిద్ధ పీఠాలలో రామేశ్వరం మొదటిదంటారు. రెండవది ద్వారక. మూడవది పూరి. నాల్గవది బదరీనాథ్. పన్నెండు జ్యోతిర్లింగాలలో కూడా రామేశ్వరంలోని రామలింగేశ్వర మూర్తి ప్రధానమయినది.

సముద్రమధ్యంలోచక్కనిద్వీపాకారంలోఉన్న రామనాథపురం చూచేందుకు చిన్న గ్రామమయినా పరిసరాల్లో ఉన్న ఆలయవైభవం, ప్రాకృతిక సౌందర్యం చూస్తుంటే యాత్రికులకు రామాయణకాలంలో సీతా రామాంజనేయులతో పాటు కాలక్షేపంచేస్తున్నట్టు అని పిస్తుంది. సీతాదేవి ఇసుకతో నిర్మించిన లింగాన్ని పక్కకు పెట్టి తాను కాశీనుంచి తెచ్చిన లింగాన్ని



రాముల వారి చేత ప్రతిష్ఠింపచేయాలని ప్రయత్నిస్తున్న ఆంజనేయ విగ్రహాన్ని చూచి తీరాలి. పురాణగాధ నిజమైనా కాకపోయినా రామలింగేశ్వరస్వామి ఆలయంలో ప్రవేశించే ముందు కని పించే యీ హనుమంతుకి ఆకృతి మాత్రం అందరి హృదయాలను ఆ కట్టుకుంటుంది.

స్వామిని సేవించే ముందు యాత్రికులు దేవాలయంలో ఉన్న 22 తీర్థాలలో స్నానం చేస్తారు. ఈ నీటిలో మూలికల కలయిక ఉందని ప్రతీతి. ఆలయం బయట మరి 21 తీర్థాలున్నాయి. రామపాదాంకితమైన యీ క్షేత్రమంతా తీర్థమయంగా కనిపిస్తుంది. ఆలయంలోని స్ఫటికలింగాన్ని ముట్టుకుని పూజించే అధికారం అందరికీ లేకపోయినా స్వామి అభిషేకాన్ని చూడటమే ఒక ఆనందం. ఆలయ పరిసరాలలో కోదండరామస్వామి, అమ్మవారు పర్వత వర్ధని, గంధమాదన పర్వతం, దర్భశయనం, ఆదిజగన్నాథ మందిరం. దేవీ పట్నం చూడవలసిన స్థలాలు. కోదండస్వామి ఆలయం ఉన్న చోటే విభీషణ శరణాగతి జరిగిన స్థానం. గంధమాదన పర్వతం మీద నిలబడి రాములవారు లంకను వీక్షించారని ప్రతీతి. హనుమంతుడు సముద్రం దాటింది కూడా ఈ పర్వతం మీది నుంచే అని చెప్తారు. సేతుబంధనం చేసేముందు శ్రీరామచంద్రుడు సముద్రుణ్ణి వశంచేసుకునేందుకు ప్రతిజ్ఞ చేసి శయనించిన స్థలమే దర్భశయనం. దేవీపట్నంలో నవగ్రహదేవతల అనుగ్రహం కోసం రామభద్రుడు తొమ్మిది రాతిస్తంభాలు సముద్రం మధ్య స్థాపించాడు. వీటినే నవపాషాణాలు అంటారు. దర్భశయనం పక్కనే ఆది శేషువు మీద విశ్రమిస్తున్న ఆది విష్ణువు విగ్రహం చాలా మనోహరంగా ఉంటుంది. దీనినే ఆది జగన్నాథ మందిరం అంటారు. అన్నింటిని మించిన దివ్యక్షేత్రం ధనుష్కోటి. ఇది రామేశ్వరానికి 20 కి. మీ. దూరంలో ఉంటుంది. బంగాళా ఖాతం, దక్షిణ మహాసముద్రం కలిసే చోటిది. కోటినదులు ధనుష్కోటిలో కూడి ఉన్నాయని త్యాగరాజు ఈ క్షేత్ర మహిమను కీర్తించారు.

# 3. గయ-ప్రయాగ

గంగాస్నానం, గయాశ్రాద్ధం హిందువుల కర్మకాండలో చాలా ముఖ్యమైనవి. గంగాస్నానం కోసం కాశీకి వచ్చిన ఆస్తికులు గయకు వెళ్ళి విష్ణుపాదంలో పిండ ప్రదానం చేసితీరుతారు. కాకతాళీయంగా ఈ రెండు క్షేత్రాలూ (కాశి-గయ) బౌద్ధమతస్థులకు కూడా పవిత్ర తీర్థాలయినాయి. కాశీకి సమీపంలో సారనాథ్, గయకు సమీపంలో బుద్ధ (బోధ) గయ ప్రపంచంలోని బౌద్ధులకందరికీ తప్పక చూడవలసిన పుణ్యక్షేత్రాలు. ఇది కాక బుద్ధ భగవానుడు జన్మించిన లుంబిని (నేపాలు), పరి నిర్వాణం పొందిన కుశినగరం (గోరఖ్‌పుర్) కూడా బౌద్ధులకు పవిత్రక్షేత్రాలే. బుద్ధా వతారం శ్రీమహావిష్ణువు తాల్చిన దశావతారాలలో ఒకటి కాబట్టి ఈ క్షేత్రాలు హిందువులకు కూడా సేవింపదగినవే. గౌతమ బుద్ధుడు సిద్ధార్థదశలో ఉన్నపుడు అక్షయవటం క్రిందనే తన తపస్సు ఆరంభించి తన సాధనా స్థలం చేసుకున్నారని ప్రతీతి. ఏది ఎలా వున్నా కాశీ, గయ రెండూ హిందూ బౌద్ధ మతస్థులకు సరిసమానంగా పుణ్యక్షేత్రాలు.

ముఖ్యంగా పితృకార్యాలకే పరిమిత క్షేత్రమయినప్పటికీ గయను గురించి న ప్రసక్తి అగ్ని, గరుడ, వాయుపురాణాలలో విపులంగా కనిపిస్తుంది. త్రిపురాసుర తనయుడైన గయాసురుడు ఈ క్షేత్రానికి మూల పురుషుడు. అతడు గొప్ప విష్ణుభక్తుడు. అతన్ని చూస్తేనే ప్రజలకు మరణానంతరం పుణ్యలోకాలు లభించేవి. అతని మహిమను చూచి దేవతలు కూడా అసూయపడ్డారు. చివరకు

అతన్ని భూగర్భంలో చిర నివాసం చేసేట్టు చేశారు. చివరకు అతని శరీరం సోకితేనే జీవికి పుణ్యలోకాలు ప్రాప్తించేవరం విష్ణుమూర్తి అతనికి ప్రసాదించాడు. ఇప్పటికీ గయాక్షేత్రంలో ఫల్గునదీతీరంలో అతడు శయనించి వుంటాడు. ఆనదీతీరంలోనే విష్ణుపాదం ఉంది. అక్షయవటం కూడా అక్కడనే ఉంది. ఫల్గునది దాదాపు ఎండినట్టే ఉంటుంది. కాని కొంచెం తవ్వితే నీరు ఊరివస్తుంది. ఆనదిలో స్నానం చేసి అక్షయవటం క్రింద పిండప్రదానం చేస్తే పితృదేవతలు తరిస్తారని క్షేత్ర మాహాత్మ్యం. ఒక్కసారి గయలో శ్రాద్ధం పెడితే మరియిక శ్రాద్ధం పెట్టవలసిన పని లేదని శాస్త్రాలు చెబుతాయి. ఇప్పటికీ ఎక్కడ తర్పణం చేసినా 'గయాయాం దత్తామస్తు' (ఇది గయకు చెందాలి) అని ఆస్తికులు కోరుకుంటారు. గంగా తీరంలో దహనసంస్కారం. గయాక్షేత్రంలో పిండప్రదానం చాల పవిత్రకర్మలుగా హిందువులు భావిస్తారు. కాశీలో వలె గయలో కూడా తమకు చాలా ఇష్టమైన వస్తువును విసర్జించటం ఒక పరిపాటి. త్యాగబుద్ధిని అలవరచుకునేందుకు ఈ ఆచారం ఉపకరిస్తుంది.

విష్ణుపాదాలు ముద్రితమైవున్న ఆలయం కూడా చాలా భవ్యంగా ఉంటుంది. ఆలయంలో శేషతల్పం మీద శయనించి వున్న విష్ణుమూర్తిని చిత్రించిన ప్రాచీన కళాఖండం కమనీయంగా ఉంటుంది. విష్ణుపాదాలయానికి కొద్ది దూరంలో బ్రహ్మయోని, మాతృయోని అని రెండు కొండ గుహలు వున్నాయి. ఈ గుహలలో ప్రవేశించి బయటకి వస్తే జన్మమరణాల బాధ మరి వుండదని అంటారు.

ఇంత మహిమగల పుణ్యక్షేత్రం కాబట్టే గౌతమ బుద్ధుడు ఇక్కడ బుద్ధభగవానుడుగా రూపొంది పరిపూర్ణమైన జ్ఞానాన్నితాను పొంది తన తోటి ప్రపంచానికి అందజేయగలిగారు. ఆ మహనీయునికి జ్ఞానోదయం ప్రసాదించిన రావి చెట్టు బోధివృక్షం

అయింది. అక్కడనే మహాబోధి మందిరం వెలసింది. ప్రపంచంలోని బౌద్ధులకందరికీ ఇది యాత్రాస్థలమయింది. ఈ ఆలయంలో బుద్ధ విగ్రహంతో పాటు శివలింగం కూడా ఉండటం విశేషం. బోధి వృక్షంలోని మొక్కలే శ్రీలంకకు కూడా చేరి అశోక చక్రవర్తి కుమార్తె అయిన సంఘమిత్రకు స్ఫూర్తిని ప్రసాదించాయి. అదే అక్కడి అనూరాధపురం.

మహాబోధి మందిరంలోని ప్రతి అణువూ, ప్రతికణమూ బుద్ధ భగవానుని సిద్ధిసాధనల చరిత్రను చాటి చెబుతుంది. ఆయన కూర్చున్న చోటు వజ్రాసనమయింది. ఆయిన తదేకదృష్టితో చూచిన తావున 'అనిమేషలోచన స్తూపం' వెలిసింది. ధ్యాన ముద్రలో ఆయన తిరిగిన భూమి 'చంక్రమణ చైత్యం' అయింది. ఆత్మజ్యోతిని పలువన్నెలలో ప్రసరించిన ప్రదేశం 'రత్నగర్భ చైత్య' మయింది. ఇలాంటి పుణ్యక్షేత్రానికి ఈ నాడు కూడా నిష్టాపరులు లక్షల కొలది ప్రదక్షిణాలు చేస్తారంటే ఆశ్చర్యం లేదు.

అటు హిందూ మతానికీ, ఇటు బౌద్ధమతానికీ ఆరాధ్యమైన గయాక్షేత్రం నిజంగా బుద్ధికీ, సిద్ధికీ ప్రసిద్ధ నిలయం అని చెప్పుకోవాలి.

## ప్రయాగ

గంగ, యమున, సరస్వతి-ఈ మూడు నదులు కలిసే పుణ్యక్షేత్రమే ప్రయాగ, దీనినే త్రివేణీ సంగమం లేక త్రివేణి అని కూడా అంటాం. గంగా యమునల కలయిక స్పష్టంగా కనిపిస్తుంది. కాని 'సరస్వతి' ఎటు నుంచి ఎలా వచ్చి ఎక్కడ కలుసుకుందో మన చర్మ చక్షువులకు గోచరించదు. ఆమె అంతర్వాహిని కనక అంతశ్చక్షువులకే కనిపిస్తుంది: మనకు కనిపించనంతమాత్రన లేదని చెప్పే అధికారం మనకు లేదు

కాబట్టి ఉందనుకొని ఆనందించటమే మేలు. మిట్ట మధ్యాహ్నం ఈ రసత్రయి కలిసే సంగమస్థలిని సూర్యకిరణాలు కాంతిమంతం చేస్తుంటే అది కేవలం జన ప్రవాహం కాదు, కాంతి సలిలాల ఏకాంత సంభాషణ అనిపిస్తుంది. సృష్టికర్త చేసిన ఒక మహాయాగానికి ఫలశ్రుతిగా వసుమతి రాగమాలిక పాడుతున్నట్లు అనిపిస్తుంది. నిజంగా ప్రయాగ యాగ భూమి, ప్రజాపతి చేసిన ప్రకృష్టయాగం ఇక్కడ ఫలించినందువల్లనే ఈ పుణ్యభూమికి 'ప్రయాగ' అనే పేరు వచ్చింది. అందుకే యీ క్షేత్రాన్ని 'తీర్థరాజం' అని కూడా అంటారు.

త్రివేణీ సంగమంలో స్నానం చేయటమే ప్రయాగ యాత్రలోని ప్రధాన కార్యక్రమం. స్నానం ఏ నాడైనా చేయవచ్చు. కాని మాఘమాసంలో స్నానం చేయటం ప్రయాగ మాధవస్వామికి చాలా ప్రీతికరమని ప్రతీతి. ఇది కాక పన్నెండు సంవత్సరాలకు ఒక సారి ఇక్కడ 'కుంభ మేలా' అని గొప్ప ఉత్సవం జరుగుతుంది. ఈ ఉత్సవం హరిద్వారం, ఉజ్జయిని, నాసిక్‌లో కూడా జరుగుతుంది. కాని ప్రయాగలో జరిగే కుంభం అన్నిటికంటె ప్రసిద్ధంగా భావించ బడుతుంది. దీనికి లక్షలాది జనులు వస్తారు. యోగులు, బాబాలు, పండితులు, భక్తులు, సామాన్యజనులు కేవలం సంగమంలో స్నానం చేసేందుకు వస్తారు, దేశంలోని అన్ని తీర్థాలలో అత్యంత పవిత్రమైనది కనకనే దీన్ని తీర్థరాజం అన్నారు. నదీతీరంలో కొన్ని చిన్నచిన్న ఆలయాలు కూడా ఉన్నాయి. భరద్వాజాశ్రమం, కాళీమందిరం, హనుమంతుని ఆలయం ముఖ్యమైనవి.

నదీతీరంలో సంగమ స్థలానికి సమీపంగా ఉన్న హనుమంతుని ఆలయంలో విశ్రమిస్తున్న హనుమ ప్రతిమ కనిపిస్తుంది. ఈ ముద్రలో ఉన్న హనుమ మరియెక్కడా కనిపించడు. వరదలు వచ్చినప్పుడు నదీ జలం హనుమ

చరణాలదాకా వచ్చి తిరిగి వెళ్ళుతుంది. ఈ హనుమ చాలా మహిమకలవాడని చెప్పుకుంటారు. అన్ని మతాలవారికీ ఈ ఆలయంలో ప్రవేశం ఉంది.

ప్రయాగలో భరద్వాజాశ్రమానికి అంత ప్రాశస్త్యం లేకపోయినా రామాయణంలో భరద్వాజమహర్షి చాలా ప్రముఖపాత్ర. శ్రీరామచంద్రుడు వనవాసానికి బయలుదేరి వెళ్లే సమయంలోను, తిరిగి వనవాసం పూర్తి అయ్యాక అయోధ్య చేరే ముందూ ఆ మహర్షి ఆశ్రమంలో కొంత సమయం గడుపుతారు. అలాగే భరతుడు కూడా చిత్రకూటం వెళ్ళేముందు, తిరిగి వచ్చేటప్పుడు మహర్షి ఆశ్రమంలో బస చేస్తారు. అసలు వనవాస కాలమంతా తన ఆశ్రమంలోనే గడపవచ్చునని మహర్షి రాములవారికి చెప్తారు. అలా వీలుకాదని రాముడు సవినయంగా చెప్పినప్పుడు చిత్రకూటం వనవాసానికి అనువయిన చోటని ఆయన సూచిస్తారు. ఆసందర్భంలో చిత్రకూటాన్ని వర్ణిస్తూ మహర్షి చెప్పిన మాటలు చిత్రకూటం యొక్క ప్రాశస్త్యాన్ని వివరిస్తాయి.

చిత్రకూటం ఇప్పటికీ ఆ ప్రాశస్త్యాన్ని నిలబెట్టుకున్న పుణ్యక్షేత్రం, ప్రయాగకు 130 కి. మీ దూరంలో ఉన్న చిత్రకూటంలోనే రామ భరతుల కలయిక, రాముణ్ణి తిరిగి అయోధ్య వచ్చి రాజ్యం స్వీకరించ వలసిందని భరతుడు బ్రతిమాలడం, చివరకు పాదుకలతో తృప్తిపడి నంది గ్రామం వెళ్ళటం జరుగుతాయి. కామదగిరి మీదనే ఈ కీలక సమావేశం జరిగింది. మందాకినీనది, జానకి స్నానం చేసిన రేవు. స్ఫటికశిల మీద రామపాద ముద్రలు ఇప్పటికీ అక్కడ కనిపిస్తాయి. సీతారాములు మెట్టిన పుణ్యభూమి చిత్రకూటం.

# 4. అయోధ్య-మధుర

శ్రీ రాముడు జన్మించిన పుణ్యభూమి అయోధ్య. శ్రీ కృష్ణుడు జన్మించిన దివ్యభూమి మధుర, ఈ రెండు క్షేత్రాలూ భారతీయులకే కాక విదేశీయులకు కూడా దర్శనీయమైన యాత్రాస్థలాలు. సరయూతీరంలో అయోధ్య ఉంది. యమునా తీరంలో మధుర ఉంది. శ్రీ రామనవమి, శ్రీ కృష్ణ జన్మాష్టమి ఈ రెండు క్షేత్రాలలో ఈ నాటికీ వైభవోపేతంగా జరుగుతాయి. ఈ మధ్య జరిగిన రాజకీయ సంఘటనల వల్ల అయోధ్యలోని ప్రాచీన వైభవం కొంత తరిగినా సీతా రామలక్ష్మణుల ప్రాశస్త్యాన్ని వివరించే స్థానాలు ఇంకా ఇక్కడ చెక్కు చెదరకుండా ఉన్నాయి. హనుమాన్ గఢీ, కనక భవనం, లక్ష్మణ్ ఘాట్, వశిష్ఠకుండ్, భరత కుండ్ మొదలయిన స్థానాలు చూడదగినవి. వాల్మీకి మందిరం కూడా చూడతగిన స్థలం. వాల్మీకి రామాయణంలోని 24000 శ్లోకాలు ఈ ఆలయంలో గోడల మీద చక్కగా చెక్కారు. దీన్ని ప్రజలకు ఉపయోగించేట్టు చక్కని అంతర్జాతీయ రామాయణ సంస్థగా రూపొందించవచ్చు. రామాయణం భారత దేశానికి జ్ఞానపీఠం లాంటిది. అయోధ్య మానవజాతికి చేసిన మహోపకారం ఈ మహా కావ్య రసాయన ప్రసారమే.

శ్రీ కృష్ణ జన్మభూమి. మధుర, లీలా క్షేత్రం గోకులం, బృందావనం ఈ నాటికీ ఆనాటి వైభవాన్ని కనులకు కట్టినట్టు చూపించేట్టుగానే నిర్వహించబడుతున్నాయి. అంతర్జాతీయ స్థాయిలో కూడా ఈ క్షేత్రం పేరు ప్రతిష్ఠలు సంపాదించింది.

రాజులు మారినా, రోజులు మారినా 'హరే రామ హరే రామ రామ రామ హరే హరే హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే' అన్న దివ్య నామసంకీర్తనం ఈ రెండు క్షేత్రాలను ఆ చంద్రతారార్కం నిలబెట్టగలవు.

శ్రీకృష్ణ జన్మ స్థానమయిన మధురలో ముఖ్యంగా చూడవలసింది కేశవస్వామి ఆలయం. ఇందులో రాధా కేశవులు ప్రధాన మూర్తులు. ఎడమవైపు నుండి ఆలయంలో ప్రవేశిస్తుంటే జగన్నాధ, బలరామ సుభద్రలను చైతన్య మహా ప్రభువు తిలకిస్తున్న ప్రతిమ చూడవచ్చు. కుడివైపున సీతారామ లక్ష్మణులతో పాటు ఆంజనేయ స్వామి దర్శనమిస్తారు. ఎదురుగా శ్రీ కేశవేశ్వరస్వామి, దుర్గ కూడా నెలకొని ఉంటారు.

మధుర, బృందావనం, గోకులం-మూడింటినీ కలిపి వ్రజభూమి అంటారు. ఇక్కడ కృష్ణ లీలలను స్మరింపచేసే స్థానాలు చాలా ఉన్నాయి. గోవర్ధన పర్వతానికి చాలా మంది ప్రదక్షిణం చేస్తారు. కంసుణ్ణి సంహరించిన తర్వాత కృష్ణుడు విశ్రమించిన స్థలంలో విశ్రామఘాట్ ఉంది. దేవకీవసుదేవులు ఉన్న కారాగారం, నందయశోదల నివాసం, రాధాకృష్ణుల విహార భూమి వ్రజ మండల మంతా కృష్ణమయం. ఎక్కడ చూచినా ఆలయమే. ఇప్పటికీ కొత్త కొత్త ఆలయాలు, సంస్థలు ఏర్పడుతున్నాయి.

# 5. జగన్నాథపురి-ద్వారక

సందర్శన మాత్రం చేత భక్తులకు ముక్తిని ప్రసాదించే ఏడు పుణ్యక్షేత్రాలలో జగత్ ప్రసిద్ధి చెందింది జగన్నాథపురి. జగన్నాథస్వామిని స్మరించగానే పూరీ అన్న పేరు స్ఫురిస్తుంది. అలాగే పూరీ (పురికి వాడుకరూపం) అనగానే జగన్నాథ స్వామి వెలసిన పుణ్యక్షేత్రం అని తెలుస్తుంది. ద్వారక కూడా మోక్షదాయకములయిన యేడుక్షేత్రాలలో ఒకటి. ఈ రెండు క్షేత్రాలు కూడా శ్రీ కృష్ణ చరిత్రకు సంబంధించినవే కావటం విశేషం.

జగన్నాథస్వామి ఆలయంలో శ్రీ కృష్ణ, బలరామ, సుభద్రల విగ్రహాలకు పూజ జరుగుతుంది. శ్రీ కృష్ణ విగ్రహం నల్లగా ఉంటుంది. బలరామ మూర్తి తెల్లగా ఉంటుంది. సుభద్ర పసుపు రంగులో కనిపిస్తుంది. బలభద్ర, సుభద్రల సాహచర్యం వల్ల నల్లని విగ్రహాన్ని కృష్ణ విగ్రహం అనుకుంటామేకాని పండితులు ఆ మూర్తినే జగన్నాథస్వామి అని పిలుస్తారు. ఈ మూడు మూర్తులలోని అంతరార్థం నిజంగా ఎవరికీ తెలియదు. పురాణాలు, కావ్యాలు, ఆగమశాస్త్రాలు బహుళంగా వ్యాఖ్యానాలు చేశాయి. ఉత్కళ దేశవాసులు మాత్రం జగన్నాథస్వామిని తమ గణదేవతగా, కులదేవతగా, ఇష్ట దేవతగా భావించి ఎంతో చనువుతో, ప్రేమతో సేవిస్తారు. ఎక్కడ శుభకార్యమయినా జగన్నాథస్వామికి ఆహ్వాన పత్రిక అంది తీరవలసిందే. స్వామి వాళ్ళ దృష్టిలో జగన్నాయకుడే కాక వాళ్ళ ఇంటికి కూడా యజమాని. భువన పతిని భవన పతిగా భావించి ఆరాధించటంలో ఉత్కల వాసుల ఆత్మీయత

స్పష్టమవుతుంది. ఈ గుడి, ఈ గుడిలోని దివ్య మూర్తుల మహిమ ఎంత ప్రాచీనమైనదో ఎవరికీ తెలియదు. స్కాంద, బ్రహ్మ, మత్స్య పురాణాల్లో దీనికి సంబంధించిన తత్త్వ చింతన కనిపిస్తుంది. సరళాదాసు ఒరియా భాషలో వ్రాసిన మహాభారతంలోని మౌసల పర్వం శ్రీ కృష్ణ నిర్యాణంతో ఈ ఆలయ వృత్తాంతానికి సంబంధం అన్వేషిస్తుంది. ఏది ఎలాగయినా కొండజాతివాళ్ళ మొండి భక్తినుంచి తథాగతుల తత్త్వదర్శనం వరకు జగన్నాథుడు ఎవరు ఎలా పిలిస్తే అలా పలుకుతాడు. జగన్నాథస్వామికి కుల, మత భేదాలు లేవు. అందరూ సమానమే, అందరూ కలిసి స్వామి ప్రసాదాన్ని ఎంగిలి అనే భావంలేకుండా ఒకేపాత్రలో ఆరగిస్తారు.



నిత్యం వేల కొలది యాత్రికులకు స్వామి ప్రసాదం అందుతుంది. పండుగ రోజుల్లో లక్షకు మించిన జనం ఈ ప్రసాదం కోసం ప్రాకులాడుతారు. ఇంత పెద్ద అన్న సత్రం ప్రపంచంలో మరే ఆలయంలో కూడా లేదేమో అనిపిస్తుంది.

జగన్నాథుని రథయాత్ర ఈ క్షేత్రంలో సంవత్సరానికి ఒక పర్యాయం-ఆషాఢ మాసంలో-జరుగుతుంది. ఈ రథోత్సవాన్ని చూచేందుకు లక్షలాది యాత్రికులు వస్తారు. రథంలో బల భద్ర, జగన్నాథ, సుభద్రల విగ్రహాలను ప్రతిష్ఠించి రథ యాత్రసాగిస్తారు. రథానికి 16 చక్రాలు ఉంటాయి. వేలకొలది బలిష్ఠులు ఈ రథాన్ని నడిపిస్తారు. ఒక కిలో మీటరు దూరంలో ఉన్న గుండిభ మందిరం వెళ్ళి రథం ఆగుతుంది. ఈలోగా కొందరు రథ చక్రాలకింద నలిగిపోవటం కూడా కద్దు. కాని కాశీమరణంలాగా దీన్ని కూడా భక్తులు ఆత్మార్పణంగా భావిస్తారు. రథం మళ్ళీ జగన్నాధాలయం చేరుకున్న తర్వాత దాన్ని విరిచివేస్తారు. ప్రతి సంవత్సరం మరో రథం తయారు చేయవలసిందే.

ప్రధానమైన రథోత్సవమే కాక సంవత్సరం పొడుగునా ద్వాదశ యాత్రలని పన్నెండు యాత్రలు చేస్తారు. స్నానయాత్ర జ్యేష్ఠ పూర్ణిమనాడు జరుగుతుంది. చందన పర్వం 42 రోజులు జరుగుతుంది. జగన్నాధ స్వామి ఆలయంలో జరిగే పండుగలన్నీ పల్లెల్లో కూడా జరుగుతాయి. జగన్నాధుడు ఉత్కల వాసులకు ఇలవేల్పు.

పరమాత్మునితో ఇంతటి ఆత్మీయత అనుభవించటం అందరికీ సాధ్యం కాదు.

## లింగరాజాలయం

పూరీ వెళ్ళిన యాత్రికులు భువనేశ్వరం వెళ్లి తీరుతారు. ఈ శివక్షేత్రం పూరీకి 60 కి. మీ. దూరంలో ఒరిస్సాకు రాజధాని

అయిన భువనేశ్వరంలో బిందు సరోవరమనే తీర్థానికి సమీపంలో ఉంది. జగన్నాథస్వామి లాగానే భువనేశ్వరాన్ని పాలించే లింగరాజస్వామి కూడా సహజమైన లింగమూర్తి. ఇక్కడ లెక్క లేనన్ని శివాలయాలు జీర్ణావస్థలో ఉన్నాయి. అయినా ప్రాచీన కళావైభవం ప్రతి రాతిలో కనిపిస్తుంది. బిందు సరోవరం చుట్టూ దాదాపు 500 ఆలయాలున్నాయి. అన్నింటికీ మకుటాయమయింది లింగరాజాలయం. స్వామికి నిత్యం శుద్ధజలంతో, పాలతో అభిషేకం జరుగుతుంది. ప్రసాదనైవేద్యాలు, అర్చనలు దాదాపు జగన్నాథస్వామికి లాగానే జరుగుతాయి. సకల జగత్తుకు నాథుడైన జగన్నాథుడు సముద్రతీరంలో పూరీని పవిత్రం చేస్తుంటే సర్వాంగ సుందరుడైన లింగరాజు త్రిభువన పావనమైన భువనేశ్వరాన్ని హరి హరాత్మకం చేస్తుంటాడు.

### ద్వారక

జగమేలే పరమాత్ముడు పూరీలో బలభద్ర సుభద్రలతో కూడి ప్రపంచాన్ని భద్రంగా చూస్తుంటే, పశ్చిమ సముద్రతీరంలో ద్వారకాధీశుడు స్వర్గానికీ, మోక్షానికీ ద్వారం చూపిస్తూ ఆత్మవతి అయిన రుక్మిణీ దేవికి తన ఆంతర్యం చెప్పుకుంటూ ఉంటాడు. ఇలా ప్రాక్ పశ్చిమ సముద్రతీరాలలో శ్రీ కృష్ణ దివ్యక్షేత్రాలు నెలకొని ఉండటం ఈ పుణ్య భూమి విశేషం.

ద్వాపరయుగంలో ద్వారకాధీశుణ్ణి చూచేందుకు నారదుడు వచ్చినప్పుడు ఈ నగరం ఎంత వైభవోపేతంగా ఉండేదో శ్రీ మద్భాగవతంలో చక్కగా వర్ణించబడింది. ఆ ప్రాచీన నగరం కాలం గడిచేకొద్ది సముద్రంలో లీనమైపోయింది. అయినా మిగిలి పోయిన శిధిలావశేషాలు చాలు ఆ నాటి శోభను ఊహించుకు నేందుకు. ద్వారకాధీశ మందిరం ఈ నాటి ద్వారకలో ముఖ్యంగా చూడవలసిన క్షేత్రం. పదహారవ శతాబ్దంలో ఈ ఆలయనిర్మాణం

జరిగింది. ద్వాపరయుగంలో ఈ ఆలయానికి ఆకారం ఇచ్చింది. శ్రీ కృష్ణుని ముదిమనుమడు వజ్రనాభుడని అంటారు. ప్రస్తుతం మనకు కనిపించే ఆలయం అయిదంతస్తుల దివ్య భవనం. ఆలయ శిఖరం మీద సూర్యచంద్రుల చిహ్నాలతో విలసిల్లే పతాక కనిపిస్తుంది. స్వర్గద్వారం, మోక్షద్వారం-రెండు ద్వారాలలో ఆలయంలోకి ప్రవేశమార్గం ఉంది. గర్భ గుడిలో నాలుగు భుజాలతో విలసిల్లే త్రివిక్రమ (వామన) మూర్తి ప్రతిష్ఠింపబడి ఉన్నారు. ఆలయం సమీపంలో బలరాముడికీ, కృష్ణుడికీ కుమారుడు మనుమడు అయిన ప్రద్యుమ్న, అనిరుద్ధులకూ, శివ కేశవులకూ ప్రత్యకమైన పూజాస్థానాలు ఉన్నాయి. దేవకి, రాధ, జాంబవతి, సత్యభామ మొదలయిన విగ్రహాలు కూడా ఉన్నాయి. రుక్మిణీ దేవికి మాత్రం ద్వారకాధీశ మందిరానికి దూరంగా ప్రత్యేకమైన ఆలయం ఉంది. ఆమె శ్రీ కృష్ణుని అష్ట మహిషుల్లో ప్రధానమైన భక్తురాలు కనక ఈ ఆలయానికి ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వటం జరిగింది. గోమతి సముద్రంలో కలిసే చోటున ద్వారకాధీశుని ఆలయం ఉంటే దానికి రెండు కి.మీ. దూరంలో రుక్మిణి ఆలయం ఉంది. ఆలయం చిన్నదైనా చూచేందుకు ముచ్చటగా ఉంటుంది.

## ప్రభాసతీర్థం-సోమనాథ మందిరం

శ్రీ కృష్ణుడు తన అవతారాన్ని చాలించి మరల తన దివ్య ధామాన్ని చేరుకున్న చోటును ప్రభాస తీర్థ మంటారు. ఇక్కడనే ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకటయిన-అందులో కూడా ఆది లింగం-సోమేశ్వర లేక సోమనాథస్వామి ఆలయం ఉంది. ఈ స్వామి పేరిటనే ఈ ప్రాంతానికి 'సోమనాథ్' అని పేరువచ్చింది. గోమతి సముద్రంలో కలిసే చోట ద్వారక ఉంటే, సరస్వతి అదే సముద్రతీరంలో కలిసే, చోట, సామనాథ్ లేక ప్రభాసతీర్థం

ఉంది. ఈ రెంటికి మధ్య గాంధీ మహాత్ముని కన్న పోర్‌బందర్ కూడా ఉంది. 'సౌరాష్ట్ర దేశం'లోని ఈ 'వసుధావ కాశా'న్ని శంకరా చార్యులు కీర్తిస్తూ సోమ నాథస్వామిని స్మరిస్తారు. భూదేవి అక్కడ క్కడా తన తనువు మీద ఇలాంటి గొప్ప అవకాశాలను అమర్చి అమర జీవులను సృష్టిస్తుంది కాబోలు అవే పుణ్యక్షేత్రాలవుతాయి.

అందుకే కాబోలు గోకులంలో పెరిగి, గీతామృతం పంచిపెట్టి, భారతయుద్ధం సాగించి ధర్మాన్ని నిలబెట్టిన శ్రీ కృష్ణ భగవానులు తన నిర్యాణానికి ఈ క్షత్రాన్ని ఎన్నుకున్నారు. ఆ కీర్తి ఒక బోయవాడికి ప్రసాదించి ఆ మూలంగా జగన్నాథస్వామిని ప్రాక్తటం (తూర్పు సముద్రతీరం) లో ప్రతిష్ఠించారు.

మహాత్ములు మానవ జాతికి మేలు చేసిన స్థానాలే నిజమైన పుణ్య క్షేత్రాలు.

# 6. తిరుపతి-తిరుమల

భారతదేశంలోనే కాక విదేశాలలో కూడా తిరుపతి-తిరుమల పేర్లు వినని వాళ్ళుండరు. నిత్య కల్యాణం పచ్చతోరణం లాగా సంవత్సరం పొడుగునా ప్రతిదినం తెల్లవారు జాము మూడు గంటలనుండి దాదాపు అర్ధరాత్రి వరకు రకరకాల కైంకర్యాలతో కళకళలాడే తిరుపతి వేంకటేశ్వరస్వామి ఆలయం నిజంగా ఆనందనిలయం. కాశీని ఆనందవనం అని ప్రాచీనులు ప్రశంసించినట్టే తిరుపతి-తిరుమల జంటక్షేత్రాలను కూడా ఆనంద నిలయమని అంటారు. వెంకటాద్రి లేక శేషాద్రి అని పురాణాలు కీర్తించిన దివ్య పర్వతం పైన శ్రీ వేంకటేశ్వర స్వామి ఆలయం ఉంది. దీనినే తిరుమల అంటారు. ఏడు కొండల సమూహం ఈ పవిత్ర పర్వతం. ఆదిశేషుడే పర్వతరూపంలో ఇక్కడ మెలికలు మెలికలుగా వెలసి ఉన్నాడని క్షేత్ర మాహాత్మ్యం చెప్తుంది. కొండ కింద ఈ క్షేత్రానికి సంబంధించిన రెండు మూడు ఆలయాలు, కపిలతీర్థం లాంటి పుణ్యస్థలాలు ఉన్నాయి. కొండ కింది యీ నగరాన్ని తిరుపతి అంటారు. యాత్రికులు మాత్రం తిరుపతి వేంకటేశ్వర స్వామి అనే ఈ క్షేత్ర దైవాన్ని స్మరిస్తారు. 'ఏడు కొండలవాడా వెంకట రమణా' 'గోవిందా! గోవిందా!' అని స్వామిని పిలుస్తూ నిత్యం వేలకొలది యాత్రికులు ఈ పుణ్యక్షేత్రాన్ని సేవిస్తారు. రాత్రి ఒంటిగంట నుంచి మూడుగంటల వరకే స్వామికి విశ్రాంతి.

శ్రీ వేంకటేశ్వరస్వామిని శ్రీనివాసుడని కూడా అంటారు. వేంకటాచలపతి, శేషాద్రి శేఖరుడు అని కూడా భక్తులు కీర్తిస్తారు. ఉత్తర భారతీయులు బాలాజీ అని వ్యవహరిస్తారు. తెలుగు ప్రజలు ఆత్మీయతతో 'వడ్డికాసుల వాడా! ఆపద మొక్కులవాడా!' అని సంబోధిస్తారు. ప్రయాణ సౌకర్యాలు విరివిగా ఏర్పడ్డ యీరోజుల్లో కూడా చాలా మంది భక్తులు కాలినడకన ఏడుకొండలు దాటి స్వామి ఆలయం చేరుకుంటారు. ఆపదమొక్కుల వాడని ప్రసిద్ధికెక్కిన స్వామి కనక తమ ఆపదలు తొలగిన ఆనందాన్ని తెలుపుకునేందుకు కొందరు తల నీలాలిస్తారు. కొందరు విలువయిన బంగారు వస్తువులు, ద్రవ్యం హుండీలో వేస్తారు. భారత దేశంలో ఇంత సంపన్నమయిన దేవస్థానం మరొకటి లేదంటారు. అయినా స్వామి అందరికీ అందుబాటులోనే ఉంటాడు. వందలు, వేలు వెచ్చించి గొప్పగొప్ప కైంకర్యాలు చేయించలేని వాళ్ళు కూడా ఉచితంగా సర్వ (ధర్మ) దర్శనం చేసుకోవచ్చు. అంతేకాదు. స్వామి దర్శనం చేసుకున్న యాత్రికులకందరికీ గర్భగుడి నుంచి బయటికి రాగానే ప్రసాదం పెడతారు. ఉచితంగా భోజనాలు పెట్టే ఏర్పాటును కూడా అవసరమైన వాళ్ళు ఉపయోగించుకోవచ్చు. అష్టకష్టాలు పడి స్వామి దర్శనం చేసుకున్న ప్రతి యాత్రికుడికీ అంతులేని ఆనందం కలుగుతుంది. మళ్ళీ మళ్ళీ స్వామిని సేవించాలనే అభిలాష ఏర్పడుతుంది. తిరుమలలో ఉన్నంత సేపు తిరుపతికి తిరిగిరావాలనిపించదు. ఆ స్థల మాహాత్మ్యం అలాంటిది.

రెండు ఎకరాల భూమిని ఆవరించిన ఆలయం బయటికి ఏమీ కనిపించదు. లోపలికి ప్రవేశించే కొద్దీ ఆలయ వైభవం క్రమంగా బోధపడుతుంది. శ్రీ వేంకటేశ్వరస్వామి విగ్రహం ఎంతసేపు చూచినా తనివి తీరనంత మనోహరంగా ఉంటుంది. మాటి మాటికీ

అలంకరణ మారుతుంది. ఏ రూపంలో చూచినా అపూర్వంగానే కనిపిస్తుంది. విష్ణు భక్తులకు శ్రీనివాస మూర్తిగా, శివభక్తులకు వేంకటేశ్వర స్వామిగా దేవీ భావంతో చూస్తే బాలా (త్రిపురసుందరి) జీగా కనిపించే దివ్యతేజస్సు స్వామి విగ్రహంలో కనిపిస్తుంది. కాని రెండుమూడు నిమిషాలకు మించి ఎవరినీ స్వామి ఎదుట నిలబడనియ్యరు. అదే యాత్రికులకు బాధకలిగిస్తుంది. కాని అలివికాని జనసమ్మర్దం వల్ల ఎవరూ ఏమీ చేయలేరు.

స్వామి ఆలయం పక్కనే స్వామి పుష్కరిణిఉంది. అక్కడ స్నానం చేసి వరాహనరసింహ స్వామిని సేవించి ప్రధాన మందిరంలో ప్రవేశించాలని నియమం. ముఖ్యాలయం కాక తిరుమలలో ఆకాశగంగ, పాపనాశనం, గోగర్భ తీర్థాలు ఉన్నాయి. యాత్రికులకు వాహనభోజన నివాసాది సౌకర్యాలు కల్పించేందుకు దేవస్థానం చక్కని ఏర్పాట్లు చేస్తుంది.

తిరుమలలో చూడవలసినవి చూచి తిరుపతికి దిగివచ్చిన తర్వాత క్రింద కూడా గోవిందరాజస్వామి ఆలయం, కోదండరామస్వామి ఆలయం, కపిలతీర్థం కూడా దర్శించ వలసిన క్షేత్రాలు. తిరుపతికి కొంచెం దూరంగా తిరుచానూరులో అమ్మవారి (పద్మావతీదేవి) ఆలయం ఉంది. అలిమేలుమంగ అని కూడా అమ్మవారిని అంటారు. అలివేలుమంగను సేవించి ఆమె ఆశీస్సులు పొందనిదే తిరుపతి యాత్ర పూర్తి కాదని యాత్రికుల విశ్వాసం.

కొంచెం ఓపిక ఉన్నవాళ్ళు పద్మావతీ శ్రీనివాస పరిణయం జరిగిన పుణ్యక్షేత్రం నారాయణ వనం కూడా దర్శిస్తారు. అక్కడ కల్యాణ వెంకటేశ్వరస్వామిని సేవించవచ్చు. గోవిందరాజుల ఆలయం కూడా తప్పక చూడవలసిన చోటు. స్వామి అన్నగారు గోవిందరాజులు. తమ్ముడి ఆదాయాన్ని భద్రతగా కాపాడి భక్తుల యోగక్షేమాలు చూడవలసిన బాధ్యత అన్నగారి మీద ఉంది.

కాబట్టి ఏడు కొండలవాణ్ణి సేవించిన తర్వాత మిగిలిన పుణ్యస్థలాలు కూడా చూడటం పరిపాటి.

తిరుపతికి 27 కి. మీ. దూరంలో శ్రీ కాళహస్తి అనే చోట చక్కని శివాలయం ఉంది. శ్రీ కాళహస్తీశ్వరుడు వాయులింగంగా ఈ ఆలయంలో నెలకొని ఉన్నాడు. ఇది స్వయం భూలింగం అంటారు. ఆలయంలో స్వామి ముందు వెలిగించిన దీపాలు గాలికి కదులు తున్నట్టు కనిపిస్తాయి. ద్వారం మూసివేసినా గర్భ గుడిలోని దీపం చలిస్తున్నట్టు ఉంటుంది. అర్చకులు కూడా ఈ లింగ మూర్తిని తాకి అభిషేకం చేయరు. అలాంటి అర్చనలు, పూజలు ఉత్సవ మూర్తికే చేస్తారు. ఇది చాలా ప్రధానమైన శివక్షేత్రం.

శ్రీ అంటే సాలీడు, 'కాల'(ళ) అంటే పాము 'హస్తి' అంటే ఏనుగు అని అర్థం. ఈ మూడూ శివసేవ చేసి తరించిన క్షేత్రం కాబట్టి దీనికి శ్రీ-కాళ-హస్తి అనే పేరు వచ్చింది. కన్నప్ప అనే భక్తుడు కూడా ఈ క్షేత్రంలోనే శివసాయుజ్యాన్ని పొందాడని క్షేత్రమాహాత్మ్యం చెబుతుంది.

# 7. కామాక్షి-మీనాక్షి

శ్రీచక్ర స్వరూపిణి అయిన దేవిని ఉపాసించేందుకు కంచిలోని శ్రీ కామాక్షీదేవి ఆలయం చాలా ప్రసిద్ధ పుణ్యక్షేత్రం. దాదాపు వంద దేవాలయాలతో స్వర్ణనగరంలా విలసిల్లే కాంచీక్షేత్రం వైష్ణవులకూ, శైవులకూ ఆరాధ్యమైనది. బ్రహ్మయజ్ఞం చేసి వరదరాజరూపంలో విష్ణువును వెలయింప చేసిన తపోభూమి యిది. ఇక్కడనే పార్వతి తన భర్తను మామిడి చెట్టు రూపంలో అవతరించినట్టు భావించి సేవించిందని ప్రతీతి. ఆస్థలంలోనే ఇప్పుడు ఏకామ్రేశ్వర ఆలయం ఉంది. ఇది కంచిలోని అన్ని ఆలయాలలో విశాలమయింది. ప్రాచీనమయింది కూడాను. ఇక్కడి గోపురాలూ, ప్రాకారాలూ, స్తంభాలూ అన్నీ ప్రత్యేకంగా కనిపిస్తాయి. శివరూపంలో వెలసిన ఇక్కడి మామిడి చెట్టు 3500 సంవత్సరాల నాటిదని చెప్తారు.

వరదరాజస్వామి ఆలయం కూడా వైష్ణవులకు చాలా ముఖ్యమైన ఆలయం. బ్రహ్మతపను చేసిన స్థలమిది. హస్తిగిరి అనే పర్వతం మీద ఈ ఆలయం ఉంది. మొసలి నోట చిక్కుకొన్న గజేంద్రుడు ఇక్కడనే విష్ణువుని రక్షించమని ప్రార్థించినట్టు పురాణాలు చెబుతాయి. ఈ క్షేత్రానికి సంబంధించిన చిత్రవిచిత్ర కథలు మార్కండేయ పురాణంలో ఉన్నాయి. ఇక్కడ వెండి బల్లి, పైడి బల్లి-అని రెండు బల్లులు కూడా ఉన్నాయి. ఈ బల్లులను తాకితే బల్లిపతనం వల్ల వచ్చే పాపాలు పోతాయని నమ్మకం. లక్ష్మికీ, సరస్వతికీ పోటీలు కూడా ఇక్కడనే జరిగినట్టు చివరకి

బ్రహ్మ, విష్ణువు ఇద్దరి తగాదాలు తీర్చినట్టు కూడా చక్కని కథ ఉంది. కంచి దేవాలయాలకే కాక పట్టు చీరెలకు కూడా ప్రసిద్ధి. బెనారస్ పట్టు చీరెలు యంత్రాలతో తయారయితే, కంచి పట్టు చీరెలు చేనేతతో తయారవుతాయి. పట్టు చీరెల కంటే కూడా ప్రాచీన కాలంలో ఈ క్షేత్రం కట్టు కథలకు చాలా ప్రసిద్ధంగా ఉండేది. అందుకే పసిపిల్లలకు అమ్మమ్మలు, నాయనమ్మలూ ఏవేవో కథలు చెప్పి చివరకు కథ కంచికీ, మనం ఇంటికీ అని కథ ముగించటం అలవాటు.

ఆది శంకరులు స్థాపించిన కామకోటి కాడకోటి పీఠం ఇక్కడనే ఉంది. వైష్ణవుల దివ్యదేశాలలో పదమూడు ఆలయాలు ఇక్కడే ఉన్నాయి. కొన్ని జైన మందిరాలు కూడా ఈ ప్రాంతంలో ఉన్నాయి. వేగవతి అనే నది ఈ పుణ్యక్షేత్రానికి సమీపంలోనే ప్రవహిస్తుంది. తన కంటె లక్ష్మీదేవి గొప్పదని తీర్పు చెప్పిన బ్రహ్మ మీద కోపంవచ్చి సరస్వతీదేవి వేగవతి నదిగా ప్రవహించిందంటారు, సరస్వతీసూక్తంలో 'వాజినీవతి' అని వాక్కును ఇందుకే కీర్తిస్తారేమో! ఇక్కడి ఏకామ్రేశ్వరలింగం పృథ్వీలింగం. అందుకనే యిక్కడి మట్టి చాలా గొప్పదంటారు. ఈ క్షేత్రంలో చేసిన మంచి పని ఏదయినా వెంటనే ఫలిస్తుందనీ, అది నానాటికి పెరుగుతుందని కూడా అంటారు.

## మధుర మీనాక్షి

చెన్నపట్టణం తర్వాత తమిళ దేశంలో అన్నిటి కంటె పెద్ద పట్టణం మధురై. దీనిని మధుర అని కూడా అంటారు. ఇక్కడనే సుప్రసిద్ధ మీనాక్షీదేవి ఆలయం ఉంది. కాంచీక్షేత్రం శైవులకూ, వైష్ణవులకూ ఉభయులకూ ముఖ్యమైనది. కాని మధురలోని మీనాక్షిని ఎక్కువగా శైవులే సేవిస్తారు. దీన్ని శివక్షేత్రమని కూడా అంటారు. ఈ క్షేత్రంలో రెండు ఆలయాలున్నాయి. ఒక ఆలయంలో మీనాక్షీదేవిని ప్రతిష్ఠించారు. రెండవ ఆలయానికి సుందరేశ్వరస్వామి

అధిష్ఠాత. మీనాక్షీసుందరేశ్వరుల పరిణయం పౌరాణిక కథల్లో చాలా చక్కగా వర్ణించబడింది. పార్వతీ పరమేశ్వరులే మీనాక్షీ సుందరేశ్వరులై ఇక్కడ అవతరించారని ప్రతీతి. చల్లని నీటిలో ఉల్లాసంగా సంచరించే చేపల్లాంటి కళ్ళతో భక్తులను చూచి కాచే దేవి కనక ఈమెకు మీనాక్షి అని పేరు వచ్చింది. ఆమె అపూర్వ సౌందర్యానికి స్వామి కాబట్టి క్షేత్ర పతికి సుందరేశ్వరుడనే పేరు వచ్చింది. శిల్ప సౌందర్యం కూడా దాదాపు వెయ్యి అడుగుల పొడవు, వెడల్పు గల ఈ ఆలయంలోని ప్రత్యేకమైన ఆకర్షణ. గోడల మీద ఎక్కడ చూచినా ఆ కట్టుకొనే చిత్రాలు చిత్రించి ఉంటాయి. మధ్య మధ్య 12 గోపురాలు ఉన్నాయి. దక్షిణ గోపురం ఎక్కి చూస్తే మధుర అంతా మనోహరంగా కనిపిస్తుంది. అష్ట శక్తి మండపం అన్ని మండపాలలోకీ ప్రసిద్ధ మయింది.

# 8. శబరిమల-స్వామిమలై

హరిహరుల అంశను కూడ గట్టుకొని లోక కల్యాణం కోసం ఆవిర్భవించిన స్వామి అయ్యప్పకు ఆలయమైన పుణ్యక్షేత్రం శబరిమల. కేరళలో సహ్యాద్రి పర్వతశ్రేణిలో దట్టమైన అడవుల మధ్య ఉన్నయీ క్షేత్రం సామాన్య జనులకు అందుబాటులో లేకున్నా, దారి ఎంత దుర్గమమైనా మకర సంక్రాతినాడు లక్షల కొలది యాత్రీకులు దీక్షావస్త్రాలతో కఠోరనియమాలతో 'స్వామియే శరణమయ్యప్ప' అని కొండలు, గుహలు ప్రతిధ్వనించేటట్టు నామ సంకీర్తనచేసుకుంటూస్వామి సాన్నిధ్యంకోసం తండోపతండాలుగా వస్తారు. ఇంతటి జనాకర్షణ మరియే క్షేత్రంలో లేదని పిస్తుంది. కుల,మత విచక్షణ లేకుండా స్వామి భక్తులందరూ ఈ క్షేత్రాన్ని దర్శించవచ్చు. కాని ఆహారవిహారాల్లో, వేషధారణలో మాత్రం నియమాలను పాటించాలి. నవంబరు, డిసెంబరు. జనవరి, మూడునెలలూ దీక్షాపరులు నదీ ప్రవాహం లాగా స్వామిని చేరుతూ ఉంటారు. మకర సంక్రాంతినాడు ఆ విర్భవించే జ్యోతిని చూచి తన్మయత్వం చెంది తమ జన్మసార్థకమయిందని తనివిచెంది తిరుగుప్రయాణం చెస్తుంటారు. మల అంటే పర్వతం. శబరిమల అంటే నిర్మల మయిన పర్వతం 'ఆనంద నిలయం' అని అర్థం.

అయ్యప్ప విగ్రహం 18 అంగుళాల పొడవున పంచలోహాలతో పరమ రమణీయంగా ఉంటుంది. క్షీరసాగర మధనంలో వెలువడిన అమృతాన్ని పంచిపెట్టేందుకు శ్రీమహా విష్ణువు జగన్మోహినిగా అవతరిస్తే ఆమెలో ఉన్న మోహన శక్తిని పరీక్షించేందుకు

శంకరుడు ఆమె వెంటవెళ్తాడు. చివరకు శంకరుడి మనసు చలిస్తుంది. దానితో మోహినీ శంకరుల తేజస్సుతో అయ్యప్ప ఉదయిస్తాడు. మహిషాసురసంహారం అయిన తర్వాత మహిషిని సంహరించేందుకు అయ్యప్పలాంటి తేజస్వి అవసరం కావటం వల్ల దైవయోగం అలా సమకూడింది. అయ్యప్ప మహిమను గురించి అయ్యప్ప భక్తులు అనేక విధాలుగా చెప్పుకుంటారు. మండలదీక్ష (41 రోజులు) వహించిన వాళ్ళే ఆలయంలోని ప్రవేశించేందుకు ఏర్పరచిన 18 మెట్లు ఎక్కగలరు. పదిహేను సంవత్సరాల నుంచి యాభైసంవత్సరాల వయసులో ఉన్న స్త్రీలను ఆలయంలో ప్రవేశించనియ్యరు. పురుషులు నల్లలుంగీ, నల్ల చొక్కా, నల్ల తుండు, మెడలో పూజాసామగ్రి మాత్రం ఉన్నసంచీ, నొసట బొట్టుతో నడుస్తారు. ఈ మెట్లను ఎక్కేందుకూ దిగేందుకు రెండు పర్యాయాలు మాత్రమేవాడాలి. ఇన్ని నియమాలకు లోబడి చేసిన యాత్ర జయప్రదంగా సాగే సరికి భక్తులకు ముక్తి లభించినంత ఆనందం కలుగుతుంది.

శబరిమల పంపాతీరంలో ఉండటం మరోవిశేషం. రామాయణంలో రామసందర్శనంతో తరించిన తాపసి శబరి ఇక్కడనే ఆత్మారాముణ్ణి వన్య ఫలాలతో సత్కరించింది. మాతంగవనంలో పరిచారికగా పని చేసిన శబరి మాతంగ మునుల మహిమను రాములవారికి చెప్పినప్పుడు రాముడు చాలా ఆనందిస్తాడు. అలాంటి మహిమలే ఈ నాడు అయ్యప్ప భక్తులు చెప్తుంటారు. అది క్షేత్ర మాహాత్మ్యం.

## స్వామిమలై

హరిహరుల అంశతో ఆవిర్భవించిన అయ్యప్పలాగానే గంగ, పార్వతి, అగ్ని, ఆరు మాతృకల సహకారంతో పుట్టి పెరిగిన కుమార స్వామి కూడా తండ్రిని మించిన తనయుడు. ఇద్దరూ

అసాధారణ పరిస్థితుల్లో యోగబలంతో ఉదయించిన కారణ జన్మలు. కృత్తికా నక్షత్రంలో జన్మించి కృత్తికా దేవతల స్తన్యంతో పెరిగి ఆరుముఖాలతో పన్నెండు బాహువులతో దేవతలకు సేనానిగా పేరుపొంది తారకాసుర సంహారం చేసిన కుమారస్వామిని సుబ్రహ్మణ్య స్వామి అనీ, షణ్ముఖుడనీ, ఆర్ముగమనీ, కార్తికేయుడనీ, శరవణ భవుడనీ అనేక నామాలతో పిలుస్తారు. అప్రకృతమైన పరాక్రమంతో పాటు ఆత్మజ్ఞానంలో కూడా అందె వేసిన చెయ్యి శివకుమారుడు. ప్రణవనాదంలోని రహస్యం బ్రహ్మకేమి తెలుసునని సవాలు చేసి ఆ రహస్యాన్ని తన తండ్రికి చెవిలో చెప్పిన చిట్టి గురువు సుబ్రహ్మణ్యం.

ప్రపంచానికి స్వామియైన పరమేశ్వరుణ్ణే తన శిష్యుడిగా చేసుకున్నవాడు కనక సుబ్రహ్మణ్య స్వామిని స్వామినాధుడని కూడా అంటారు. స్కందపురాణమంతా ఇతని గాథతోనిండి ఉంటుంది. అలాంటి స్వామినాథుడు స్వామిమలైలో ఆరాధ్య దేవతగా నెలకొన్నాడు. తంజావూరు జిల్లాలో కుంభకోణానికి 6 కి.మీ దూరంలో స్వామిమలై, అనే యీ పుణ్యక్షేత్రముంది. స్వామి నాథుడు తండ్రి భుజాలమీద కూర్చుని ఆయన చెవిలో ప్రణవ రహస్యం బోధించాడు కనక ఈ ఆలయం ఈశ్వర సన్నిధానం క్రింద ఉంటుంది. అక్కడ నుండి 60 మెట్లు ఎక్కిన తర్వాత సుబ్రహ్మణ్యస్వామి ఆలయం ఉంటుంది. ఈ ఆలయం మొత్తాన్ని స్వామిమలై అంటారు. ఆరుముఖాల స్వామి కనక తమిళదేశంలో ఈ స్వామిపేరిట ఆరు క్షేత్రాలు వెలిశాయి. అందులో ప్రధానమయింది స్వామిమలై.

చెన్నపట్టణం నుంచి తిరుపతికి వెళ్ళేదారిలో తిరుత్తణి అనే సుబ్రహ్మణ్య క్షేత్రం ఉంది. ఇది కూడా ఆరుక్షేత్రాల్లో ఒకటి ఇది కుమారస్వామి వల్లీశ్వరిని వరించి ఆమెను తనకు అనుకూలం చేసుకున్న క్షేత్రం అంటారు. కృత్తికానక్షత్రం రోజు ఇక్కడ ప్రత్యేక

పూజలు జరుగుతాయి. ఇక్కడ సోమరి మఠం అనే స్థలం ఉంది. అక్కడికి వెళ్ళగానే అందరికీ సోమరితనం ఏర్పడి ఆవులింతలు వస్తాయట.

అలాగే మధుర నుండి 8 కి.మీ దూరంలో 'తిరుప్పరకుంద్రం' అనే మరో ఆలయం ఉంది. ఇది కార్తికేయుడు దేవయానిని పెండ్లాడిన చోటు. సూరపద్మనే రాక్షసుని సంహారించటం కూడా ఇక్కడనే జరిగింది. దీనికి సమీపంగానే 'పయముదిర్ చోలయ్' అని మరో ఆలయం ఉంది. ఇక్కడ స్వామి పశువుల కాపరి వేషంలో వచ్చి అవ్వయ్యార్ అనే భక్తురాలి ఆకలిని తీర్చేందుకు ఆమెకు నేరేడు పండ్లు పెట్టి అనుగ్రహించాడట.

అలాగే పళని తిరుచ్చెందూరులో కూడా స్వామికి ప్రసిద్ధమైన ఆలయాలున్నాయి. పళనిలో స్వామి విగ్రహం పంచమూలికలతో చేయబడింది. ఇక్కడ దండపాణిగా స్వామి సాక్షాత్కరించి తీర్థప్రసాదాలతో భక్తులకు ఆరోగ్యాన్ని ప్రసాదిస్తాడు. తిరుచ్చెందూరు సముద్రతీరంలో ఉన్నందువల్ల చూచేందుకూ, సేవించేందుకూ చాలా ఆనందకరంగా ఉంటుంది. ఈ ఆలయం చాలా ప్రాచీనమయింది. వేయిసంవత్సరాల శిల్పవైభవం ఈ ఆలయం ప్రాకారాలలో కనిపిస్తుంది. ఆలయ ప్రాకారాల్లో 24 తీర్థాలు ఉన్నాయి. వీటిలో నావిబావి అనే తీర్థంలో మాత్రం తియ్యని మంచి నీరు లభిస్తుంది. మిగిలిన తీర్థాలన్నింటిలోని నీరూ ఉప్పునీరే.

ఈ ఆలయంలో స్వామి ఈశ్వరార్చన చేస్తున్నట్టుగా ఒక చేతిలో జపమాల, మరో చేతిలో పూజాకుసుమాన్ని పట్టుకుని సాక్షాత్కరిస్తాడు. విగ్రహాన్ని చూస్తేస్వామి ఏదో అనుగ్రహ వచనాలు ఉపదేశిస్తున్నట్టు అనిపిస్తుంది.

# 9. కాళీమాత-కన్యాకుమారి

సర్వధర్మసారాన్ని గ్రహించి ప్రపంచానికి మంచిని పంచి పెట్టిన పరమహంసను కన్నది జగన్మాత కాళి. ఆ పరమహంస పంపిన సాగర సంగమాన్ని వెదుక్కుంటూ వచ్చిన వివేకానంద యతీశ్వరులని జగద్గురువుగా రూపొందించింది సాగర కన్య కన్యాకుమారి. పరా శక్తి స్వరూపిణులయిన యీ దేవతల ఆలయాలను ఒకేసారి స్మరించటం సమంజసం.

కలకత్తాకే కాక వంగదేశాని కంతటికీ ఆరాధ్య దేవత కాళీ మాత. దేశంలోని 51 శక్తి పీఠాలలో ఇది మూలాధారమైనది. దక్షయజ్ఞంలో ఆత్మాహుతి చేసుకున్న సతీదేవి కాయాన్ని పరమేశ్వరుడు రోషావేశంతో నలుమూలలా ప్రదర్శిస్తూ వెళ్తుంటే విష్ణువు తన చక్రంతో ఆమె శరీరాన్ని 51 ముక్కలు చేశాడనీ ఆ ముక్కలలో తల్లి పాదాగ్రం భాగీరథీ తీరంలో పడిందనీ, అక్కడనే యీ కాళీక్షేత్రం వెలిసిందనీ పురాణాలు చెబుతాయి. గంగా సాగర సంగమం ఎంతో దూరంలో లేని యీ క్షేత్రంలో కాళీమాతకు అనువైన స్థానం లభించింది. జగన్నాథ స్వామి పూరీ నివాసులకే కాక ఉత్కల దేశస్థులందరికీ ఏ విధంగా ఇలవేల్పు, కులదేవతగా ఆరాధ్యుడో, అదే విధంగా వంగ దేశీయులకు ముఖ్యంగా కలకత్తా నివాసులకు కాళీ మాత హృదయాధి దేవత. దుర్గ, లక్ష్మి, సరస్వతి అన్నీ కాళీమాతలోనే కలకత్తా నివాసులకు కనిపిస్తారు. 'మాగో' అమ్మా అని పిలిస్తే పలికే ఇష్ట దేవతగా చూచుకుంటారు కాళీయులు కాళీమాతను.

దేవీ నవరాత్రులు తొమ్మిది రోజులూ కలకత్తాలోని ఆ బాలగోపాలం దేవీ సంకీర్తనలో తన్మయమయి నృత్యం చేస్తుంది. మహాలయం నాడు వేకువనేలేచి 'యాదేవీ' స్తోత్రం పారాయణం చేసినప్పటినుండి విజయ దశమినాడు అమ్మవారిని ఉద్వాపన చేసేవరకు ప్రతి వ్యక్తికీ మరోవ్యాసంగం ఉండదు. దేశంలో ఎక్కడ ఉన్నా వంగదేశీయులు ఈ పూజ తప్పకుండా చేస్తారు. సామూహికంగా జరిగే యీ కార్యక్రమం చైతన్య వంతంగా ఉంటుంది.

అమ్మవారి విగ్రహం చాలా ఉగ్రంగా ఉంటుంది. రక్త బిందువులతో కూడిన నాలుక, మెడలో అస్థిమాల విరబోసిన కేశకలాపం, విశాలమైన నేత్రాలు, చేతిలో ఖడ్గం చూచేందుకు చాలా భయంకరంగా ఉంటుంది. కాని భక్తులని ఆమె సౌమ్యంగా చల్లని చూపుతో చూస్తుంది.

కలకత్తాకు వందకిలో మీటర్ల దూరంలో గంగా సాగర సంగమం ఉంది. మకర సంక్రాంతినాడు ఇక్కడ గొప్ప ఉత్సవం జరుగుతుంది. ఆ నాడు ఈ సంగమ స్థలంలో స్నానం చెయ్యాలని లక్షలాది యాత్రికులు అన్ని కష్టాలకు ఓర్చివస్తారు. కాళీఘాట్‌లో తల్లి ఎంత ఉగ్రంగా కనిపిస్తుందో, గంగా సాగరంలో అమ్మణ్ణి అంత శాంతంగా చల్లని తల్లిలా కనిపిస్తుంది. కాని యాత్రికులకు మాత్రం రెండు చోట్ల ఆయాస ప్రయాసలు మాత్రం తప్పవు.

దక్షిణేశ్వరంలోని కాళీమాతను కూడా చూచితీరాలి. పండుగ రోజుల్లో అక్కడ కూడా జనం క్రిక్కిరిసి ఉంటారు. కాని భాగీరథిలో స్నానం సేద తీర్చి శాంతిని ప్రసాదిస్తుంది. ద్వాదశలింగాలు కూడా ఆలయంలో వరుసతీరి ఉంటాయి. ప్రశాంతంగా పూజలు, అభిషేకాలు చేసుకోదల చినవాళ్ళు తనివి దీర చేసుకోవచ్చు. శ్రీ రామకృష్ణ పరమ హంస కాళీమాతను సేవించింది యీ స్థలంలోనే. శ్రీ మాత శారదా దేవితో పరమహంస నివసించిన పుణ్యస్థలం కూడా ఇదే.

గంగ దాటగానే ఎదురుగా బేలూరు మఠం కనిపిస్తుంది. ప్రశాంతమైనస్థలం. గురు శిష్యులు దివ్యరూపంలో అక్కడనే సంచరిస్తున్నట్టు ఆస్తికులకు స్ఫురిస్తుంది. వివేకవంతులకు ఇది ఆనంద నిలయం.

**కన్యాకుమారి**

బంగాళాఖాతం, హిందూ మహాసముద్రం, అరేబియా మహాసముద్రం కలిసే చోట భారతదేశానికి దక్షిణపు కొనలో కన్యాకుమారి ఆలయం ఉంది. మూడు నదులు (గంగ, యమున, సరస్వతి) కలిస్తేనే అది తీర్థ రాజమయింది. మరి మూడు మహాసముద్రాలు కలిసే చోటు మహత్తరమైన పుణ్యక్షేత్రమని వేరే చెప్పనక్కరలేదు. పరా శక్తి అవతారమైన కన్యకాపరమేశ్వరిని సేవించేందుకు వచ్చిన యాత్రీకులు ఇక్కడ కన్నుల పండువుగా కనిపించే సూర్యోదయ సూర్యాస్తమయాలను చూచి ఆనందిస్తారు. పూర్ణిమ రోజు సూర్యాస్తమయాన్నీ చంద్రోదయాన్నీ ఒకేసారి ఒకే క్షితిజంలో చూచే అవకాశం ఇక్కడ లభిస్తుంది. ప్రకృతి మాత యాత్రికులకు ప్రసాదించే పరమానందం ఇది. భారతదేశపు దక్షిణపు కొనను సూచించే రెండు శిలలు కనిపిస్తాయి. అందులో ఒకదాన్ని పితృతీర్థం అనీ, మరో దాన్ని మాతృతీర్థం అనీ అంటారు. చాలామంది ఈ స్థానంలో స్నానంచేస్తారు. ఇక్కడి ఇసుక ఏడు రంగుల్లో ఉంటుంది. పార్వతీ పరమేశ్వరుల వివాహంలో వాడిన అక్షతల వన్నెలుగా వీటిని భక్తులు భావిస్తారు.

ఇక అమ్మణ్ణి ఆలయం చూడముచ్చటగా ఉంటుంది. పదహారు కళలతో కళకళలాడే బంగారు తల్లి ముఖం, ముఖం మీది ముద్దులు గొలిపే ముక్కుపుడక మూడు సముద్రాలను దాటి మహా మానవ సాగరానికి వెలుగును ప్రసాదిస్తూ ఉంటాయి. అమ్మణ్ణి ఆభరణాల్లో నాగమణి చాలా ప్రకాశవంతమైనది. ఉత్సవ సమయాల్లో మాత్రమే దీనితో కుమారి కన్యకను అలంకరిస్తారు. మిగిలిన రోజుల్లో

నావికులు దారి తప్పుతారేమోనని భద్రపరుస్తారు.

పురాణగాథ ప్రకారం అమ్మణ్ణి అవతారం బాణాసుర సంహారంకోసం జరిగింది. ఆ కార్యం నెరవేరే ముందే ఆమె పరమశివుని వరించింది. కాని దేవతలకు మేలు చేసేందుకు నారదుడు పరమశివుని రాకను ఆలస్యం చేస్తాడు. చివరకు జరగవలసిన అసుర సంహారం సక్రమంగా జరుగుతుంది. కాని పరమశివుడు మాత్రం శుచీంద్రం అనే క్షేత్రంలో స్థానేశ్వరుడుగా ఆగిపోతాడు. అక్కడ ఆయన, ఇక్కడ అమ్మణ్ణి ఒకరికోసం ఒకరు ఎదురు చూచుకుంటూనే ఉండి పోతారు. కన్యాకుమారి చిరకుమారిగా ఉండిపోతుంది.

సముద్రతీరానికి కొంచెందూరంలో వివేకానంద స్వామి ధ్యానం చేసిన తపశ్శిల ఉంటుంది. యాత్రికులు అక్కడికి వెళ్ళి ధ్యానం చేస్తారు.

# 10. శుచీంద్రం-త్రివేంద్రం

కేరళకు ముఖ్య పట్టణమైన తిరువనంతపురం (త్రివేంద్రం) నుంచి కన్యాకుమారి వెళ్ళే దారిలో శుచీంద్రం అనే పుణ్యక్షేత్రం ఉంది. కన్యాకుమారికి పది-పదిహేను కిలోమీటర్ల దూరంలో ఉన్న యీ క్షేత్రంలో మూడు మూర్తులు (బ్రహ్మ విష్ణువు, మహేశ్వరుడు) ఏక మూర్తిగా వెలసి వున్నారు. ఆలయం చాలా విశాలమైనది. ఏ గదిలో చూచినా పురాణగాథలు గోడల మీద కనిపిస్తాయి. ఆలయంలో ప్రవేశించగానే ఆంజనేయస్వామి విగ్రహం చాలా పెద్దది కంటికింపుగా కనిపిస్తుంది. కన్యాకుమారిని పెండ్లి చేసుకొన వలసిన పరమేశ్వరుడు ఇక్కడ స్థానేశ్వరుడై స్థావరంగా బ్రహ్మచర్య వ్రతాన్ని పాటిస్తూ వేంచేసి ఉంటాడు. కల్యాణ మండపంలో సప్తస్వరాలను వినిపించే సంగీత శిలలు ఉన్నాయి.

దేవకార్యంకోసం అహల్యను వంచించి గౌతమమహర్షిచే శాపగ్రస్తుడైన ఇంద్రుడు ఇక్కడనే తపసు చేసి శుచీంద్రుడైనాడని (మళ్ళీ తన పవిత్రతను పొందాడని) పురాణగాథ. అర్థ రాత్రి సమయంలో ఇంద్రుడు ఈ ఆలయంలో ప్రవేశించి సలసల కాగే నేతిధారలలో నడిచి ప్రభాత సమయం వరకు త్రిమూర్తులను సేవించి వెళ్లేవాడట. అంతటి ఘోర తపసు చేస్తేనే ఇంద్రుడు శుచీంద్రుడు కాగలిగాడు. అందువల్లనే ఈ క్షేత్రానికి శుచీంద్రం అనే పేరు వచ్చింది.

ఈ క్షేత్ర పరిసరంలో పెద్ద అరణ్యముంది. అత్రి మహర్షి, ఆయన భార్య అనసూయ ఈ అరణ్యంలోనే తపసు చేశారని

ప్రతీతి. అనసూయాదేవి పరమసాధ్వి. ఆదర్శ పతివ్రత. అసూయ అంటే ఏమిటో ఆమెకు తెలియదు. ఆమెను పరీక్షించేందుకు వచ్చిన త్రిమూర్తులను ఆమే పసి పాపలుగా మార్చి వాళ్ళకు విందు చేసింది. ఆ విందును ఆరగించిన ఆనంద మూర్తులే శుచీంద్రంలో ఏక లింగంగా మూర్తీ భవించిన ఈ మహాలింగంలోని పాదభాగం బ్రహ్మ, మధ్యభాగం విష్ణువు, శిరోభాగం శివస్వరూపం. అత్రి దంపతులను ఈ త్రిమూర్తులు చంద్ర, దత్తాత్రేయ, దుర్వాస మహామునుల్లాగా సాక్షాత్కరించారట. మూడు మూర్తులకు అతీతమైన విశ్వమూర్తి సాక్షాత్కరించుకున్న పుణ్యదంపతులు కాబట్టి యీ కీకారణ్యాన్ని పుణ్యక్షేత్రంగా మార్చారు.

దాదాపు రెండు వేలసంవత్సరాల నాటి దివ్యవృక్ష మొకటి ఈ ఆలయంలో ఉంది. దానిలో నుంచే త్రిమూర్తిలింగం ఆవిర్భవించింది. సృష్టి, స్థితి, లయం-ఈ మూడింటికీ మూలకారకులయిన మూడు మూర్తులను ఏకం చేసిన శుచీంద్రం పవిత్రతకు పర్యాయపదం అయింది. కుల,మత వివక్షలేకుండా అందరూ ఈ క్షేత్రాన్ని దర్శించవచ్చు, స్వామిని సేవించవచ్చు.

ఆలయంలో దాదాపు 30 గుడులున్నాయి. సీతా రాములు, నవగ్రహాలు, సంగీతశిల్పాలు, ఏడంతస్తుల గోపురం, వెయ్యి సంవత్సరాల నాటి నంది-అన్నీ చూస్తుంటే ఇది ఒక విధమైన ఆనంద లోకమనిపిస్తుంది.

**అనంత పద్మనాభస్వామి**

తిరువనంతపురంలో ముఖ్యంగా చూడ వలసింది అనంత పద్మనాభస్వామి ఆలయం. ఇది చాల ప్రాచీనమైన ఆలయం, క్రీ.శ.1733లో మార్తాండవర్మ అనే రాజు పద్మనాభస్వామికి తన సర్వస్వం సమర్పించి 'పద్మనాభదాసు' అనే పేరుతో రాజ్యాన్ని పాలించిన పరమ భక్తుడు. ఇలా స్వామికి ప్రతినిధిగా ప్రజాపాలన

చేసిన ప్రభువులు చాలా అరుదు. రామాయణంలో పాదుకలను సింహాసనం పై ప్రతిష్ఠించి రామ రాజ్యానికి ధర్మకర్తగా వ్యవహరించిన భరతుడు ఇలాంటి మనస్తత్వానికి మంగళాచరణం చేశాడు. ఆ తర్వాత మళ్ళీ మార్తాండవర్మ ఈ సంప్రదాయాన్ని పోషించిన పుణ్యజీవి. ఈ విషయం గాంధీ మహాత్ముని మనసును బాగా ఆకర్షించింది. పదవీవ్యామోహంలో ప్రజాసంక్షేమాన్ని ఉపేక్షించే ప్రజా ప్రతినిధులు ఎక్కువగా కనిపించే యీ కాలంలో అనంత పద్మనాభస్వామికి దాసులుగా దేశాన్ని పాలించిన మార్తాండవర్మ చాలా మహనీయుడు మననీయుడని చెప్పాలి. ఆ తర్వాతి ప్రభువులు కూడా ఈ సంప్రదాయాన్ని పోషించారు. దళితులకు ఆలయంలో ప్రవేశం లభించింది కూడా మొట్టమొదట ఈ ఆలయంలోనే అని అంటారు. గాంధీ మహాత్ముని ఆధ్వర్యంలో అది జరిగింది.

ఆలయంలో స్వామి విగ్రహం శయన ముద్రలో ఉంటుంది. ఆది శేషుడయిన అనంతుని వేయిపడగలపై శయనించియున్న పద్మనాభస్వామిని దర్శించేందుకు ఒక్క ద్వారం చాలదు. స్వామి 18 అడుగుల పొన్పు పై శయనించి ఉండటంవల్ల ఆయన నాభికమలం మాత్రం మధ్య ద్వారం నుంచి కనిపిస్తుంది. ఒక వైపునుంచి .వక్షస్థలం, శిరసును చూడవచ్చు. మరోవైపునుంచి పాదాలను సేవించవచ్చు. ఇంతటి విశాలమైన విగ్రహం మరే విష్ణు మందిరంలో కనిపించదు. నాభికమలం నుంచి సృష్టికర్త ఉదయించటం కూడా చూడవచ్చు. అనంత శయనం, అనంత రూపం అనంతవైభవం పద్మనాభస్వామిని అనంతమూర్తిగా మనకు ప్రసాదిస్తాయి. 'సత్యం జ్ఞానం అనంతం' అన్న వేద వాక్యం ఈ ఆలయంలో స్వామిని చూడగానే జ్ఞాపకం వస్తుంది. ఈ విగ్రహం పన్నెండువేల శాలిగ్రామ శిలలతో కూర్చ బడిందని అంటారు. ఆలయప్రాంగణంలో వందల కొలది స్తంభాలే కాక

సీతా రామలక్ష్మణ హనుమదాదుల ఆలయాలు కూడా ఉన్నాయి. గర్భగుడిలో ప్రవేశించేముందు యోగ నరసింహా స్వామి ఆలయం కూడా ఉంది.

సరిగా ఇలాంటి దేవాలయమే ఆది కేశవదేవాలయం అనే పేరిట ఇక్కడికి 45 కి.మీ దూరంలో ఉంది. అక్కడి స్వామి విగ్రహం కూడా 18 అడుగుల పొడవు ఉంటుంది. పశ్చిమాభిముఖంగా ఉండటంవల్ల ఆది కేశవులు అనంత పద్మనాభస్వామిని చూస్తూ ఉన్నారని అంటారు. అది ఆది, ఇది అనంతం.

# 11. గురువాయూర్-తిరువారూర్

స్వర్గలోకం, మర్త్యలోకం, పాతాళలోకం-మూడులోకాలూ కలిసిన భూలోకవైకుంఠం, గురువాయూరులోని శ్రీ కృష్ణ దేవాలయం. ఈ ఆలయాన్ని గురించీ, ఆలయంలోని విగ్రహాన్ని గురించీ నారదపురాణంలో విచిత్రమైన వృత్తాంతం ఉంది. మొట్టమొదట ఈ విగ్రహాన్ని బ్రహ్మదేవుడు ఆరాధించేవాడట. వసుదేవుడి కుమారుడు ద్వారకాధీశుడయిన తరువాత తండ్రి తన తనయుడికే ఈ విగ్రహం ఇచ్చాడట. తన నిర్యాణ సమయం సమీపిస్తున్నదని తెలుసుకొని కృష్ణ పరమాత్మ తన ప్రాణమిత్రుడైన ఉద్ధవుడికి దీన్ని ప్రసాదించి భూలోకాన్ని వదలిపెట్టి గోలోకానికి వెళ్ళాడు. కాలక్రమంలో ద్వారక సముద్రంలో లీనమైనప్పుడు ఈ విగ్రహాన్ని బృహస్పతి (గురువు), వాయుదేవుడూ కలిసి కాపాడి పరశురాముడి సాయంతో ప్రస్తుతం గురువాయూరు అనే స్థానానికి తెచ్చి అక్కడ ప్రతిష్ఠించారట. గురువు, వాయువు కలిసి ఈ విగ్రహానికి అనువయిన స్థానం వెదకి దీనిని పుణ్యక్షేత్రం చేశారు కాబట్టి దీనికి గురువాయూరు (గురు+వాయు+ఊరు) అని పేరు వచ్చింది. 'నారాయణీయం' అనే గ్రంథం రచించిన నారాయణ భట్టాత్రి ఈ క్షేత్రాన్ని 'గురు-పవన-పురి' అని కీర్తించారు. ఈ గ్రంథ రచనతో ఆ కవిపుంగవుడి దీర్ఘరోగం-వాయురోగం-నివారించిందని ప్రత్యక్ష నిదర్శనం.

అయిదువేల సంవత్సరాల చరిత్రగల యీ విగ్రహం సామాన్యమైన రాతితో తయారు చేసింది కాదు. పాతాళాంజనమనే

విశిష్టమైన పదార్థంతో తయారయిన దివ్యమూర్తియిది. గురువాయువులు పరశురాముడితో కలసి యీ స్థానానికి వచ్చినప్పుడు శంకరుడు ఇక్కడ తపస్సు చేస్తున్నాడట. ఆ విగ్రహాన్ని చూడగానే దానికి ఇది సరియైన స్థానమని శంకరుడే చెప్పి గురువాయువులను ఆశీర్వదించి తాను మరో స్థలానికి తరలిపోయాడట. అంతకు ముందు రుద్రతీర్థమని ప్రసిద్ధి చెందిన యీ పుణ్యక్షేత్రం ప్రస్తుతం గురువాయురు అయింది. స్వామి గురువాయురప్పన్ పేరిట ప్రసిద్ధి చెందాడు.

స్వామి విగ్రహం చూడ ముచ్చటగా ఉంటుంది. శంఖ-చక్ర-గదా పద్మాలను నాలుగు చేతుల్లో ధరించి తులసిమాల మెడలో వేసుకుని భక్తుల కోరికలను కోరకుండానే తీర్చేందుకు సిద్ధంగా కూర్చున్న చిన్ని కృష్ణయ్యను చూస్తేనే పాపాలు పరిహరించినట్టు తోస్తుంది. తెల్లవారు జాము 3 గంటల నుండి రాత్రి పది గంటలవరకు పూజలు, సేవలు జరుగుతూ ఉంటాయి. మధ్యాహ్న సమయంలో వివాహ కార్యక్రమాలు బహుళంగా జరుగుతాయి. ఇక్కడ వివాహం చేసుకుంటే గృహస్థ జీవితం మంగళకరంగా ఉంటుందని పెద్దలు చెప్పారు. చాలమంది 'తులాభారం' చేస్తామని మొక్కుకుంటారు. తక్కెడలో ఒకవైపు తాము కూర్చుని, మరోవైపు తమతోసరితూగే వెండిగాని, బంగారంకానీ, మరేదయినా ఇష్టమైన పదార్థం కానీ పెట్టి స్వామికి సమర్పిస్తారు. స్వామికి ఎన్నో ఆభరణాలు భక్తులు సమర్పించినవి ఉన్నాయి. అన్నింటిని పదిలంగా భద్రపరిచేందుకు ఒక ప్రత్యేకమైన గది ఉంది. దాని దగ్గరకు కూడా ఎవ్వరూ వెళ్ళరు. అందులో పంచ నాగులని ఐదు పాములు ఉన్నాయట.

సంగీత, నృత్య కార్యక్రమాలు కూడా ఆలయంలో జరుగుతాయి. స్వామికి రుద్ర తీర్థంలో అభిషేకం చేయిస్తారు. సాయంత్రం ఊరేగింపు జరుగుతుంది. జయదేవుని గీత గోవిందం

ఇక్కడ చాలా ప్రసిద్ధి చెందిన గ్రంథం. శ్రీ కృష్ణ జన్మాష్టమి ఇక్కడ వైభవోపేతంగా జరుగుతుంది. అంతే కాక ఏకాదశికి సంబంధించిన పండుగలు కూడా చాలా జరుగుతాయి. ఏనుగులకు ఈ ఆలయంలో చాలా ప్రాముఖ్యం ఉంది. ఏనుగు పందాలు (పోటీలు) కూడా చాలా ఉత్సాహంతో వేడుకగా జరుగుతాయి.

గురువాయూరు చాలా మహిమగల క్షేత్రం. అందువల్ల ఇక్కడ నియమాలూ, ఆచారాలూ ఎక్కువ. 'శ్రీ కృష్ణకర్ణామృతం' వ్రాసిన బిల్వమంగళ ఠాకూర్ ఈ ఆలయాన్ని పలుమారులు దర్శించారు. పారమార్థిక వైభవంతో పాటు పార్థివ సమృద్ధిలో కూడా ఈ పుణ్య క్షేత్రం నిజంగా భూలోక వైకుంఠమే, దక్షిణ ద్వారక అని కూడా ఈ క్షేత్రాన్ని భక్తులు ప్రశంసిస్తారు.

**తిరువారూరు**

గురువాయూరు కేరళలో వెలసిన కృష్ణక్షేత్రమైతే తిరువారూరు తమిళదేశంలో కావేరీకీ, తంజావూరికీ సమీపంగా ఉన్న త్యాగరాజక్షేత్రం. కర్ణాటక సంగీతానికి నూతన చైతన్యం ప్రసాదించిన భక్తగాయక శిఖామణి త్యాగరాజు పుట్టిన చోటు తిరువారూరు. ఇక్కడ త్యాగరాజు పేరిట ఒక శివాలయం కూడా ఉంది. ఈ ఆలయంలో త్యాగరాజు తల్లి దండ్రులు చేసిన శివ పూజల ఫలితమే త్యాగరాజు.

తంజావూరికి 60 కి.మీ దూరంలో ఉన్న యీ శివక్షేత్రం చాల ప్రాచీనమయినది. చాల విశాలమయినది కూడాను. బయటి గోడలు 846 అడుగుల పొడవు, 666 అడుగుల వెడల్పు గలిగి ఉంటాయి. దక్షిణదేశంలోని ఆలయాలలో చాలా పెద్ద ఆలయం ఇది. 'కమలాలయం' అనే పేరుతో ఇక్కడ పెద్ద సరోవరం ఉంది. దాని మధ్య కమలాంబిక ఆలయం కూడా ఉంది. ఇంత పెద్ద ఆలయతటాకం మరెక్కడాలేదంటారు.

ముచికుంద మహారాజు ఈ ఆలయం నిర్మించాడని ప్రసిద్ధి. 'అచలేశ్వర' అనే యీ లింగాన్ని ఆయనే ప్రతిష్ఠించారట. ఈ లింగం ఒకానొక భక్తుడికి ఇచ్చిన వరప్రసాదం ప్రకారం ఏ మాత్రం చలించదట. లింగం నీడ కూడా కదలదట. ఎప్పుడుచూచినా తూర్పువైపునే కనిపిస్తుందట. ఆరునెలలకు తక్కువ ఆయుర్దాయం ఉన్నవాళ్ళకు ఈ నీడ కనిపించదంటారు.

ఇలాంటి మహిమగల క్షేత్రంలో త్యాగ బ్రహ్మ ఉదయించారు. 'నాదతను మనిశం శంకరం నమామి మనసా శిరసా?' అని శంకరుని భావించి కీర్తించిన త్యాగరాజు శివానుగ్రహంవల్లనే జన్మించి ఉండాలి.

త్యాగరాజు పుట్టింది తిరువారూరులోనైనా పెరిగింది తిరువైయారులో. దీనిని పంచనద క్షేత్రం అంటారు. రెండు మూడు శతాబ్దాలుగా త్యాగరాజ కీర్తనలు కర్ణాటక సంగీతానికి దేశకాలాల ఎల్లలనుదాటి భాషా భేదాన్ని మరిపించి నాద బ్రహ్మను సేవించే నూతన దృక్పథాన్ని ప్రసాదించాయి.

# 12. వైష్ణవదేవి-జ్వాలాముఖి

జమ్మూ-కాశ్మీర్‌లో జమ్మునుంచి 60 కి.మీ దూరంలో ఒక కొండ గుహ ఉంది. ఇదే వైష్ణవదేవి లేక వైష్ణవి నెలకొన్న పుణ్యక్షేత్రం. గుహాలయంలో సృష్టి, స్థితి, లయలకు మూలాధారమైన పరాశక్తిని మహా సరస్వతిగా, మహాలక్ష్మిగా, మహా కాళిగా నిరూపించే మూడు విగ్రహాలున్నాయి. యాత్రికులు 'జయ్ మాతాదీ జయ్ మాతాదీ' అను కుంటూ దాదాపు మోకాలి మీదనేనడుచుకుంటూ గుహాలోకి ప్రవేశిస్తారు, గుహ చేరేందుకు కూడా చాలా దూరం నడవ వలసి వుంటుంది. అయినా కర్ర పట్టుకొని ఆయాసంతో అడుగులు పెట్టే ముసలి వాళ్ళు కూడా తల్లి పేరు చెప్పుకుంటూ అనాయాసంగా యాత్ర చేస్తారు.

దేవి మహిమ చెప్పనలవి కాదని భక్తులు చెప్పుకుంటూ ఆధ్యాత్మిక బలంతో ఈ యాత్ర కొనసాగించి జీవితం తరించినట్టు భావిస్తారు. లక్షల కొలది యాత్రికులు త్రికూట శిఖరంలో ఉన్న గుహను సేవించి తల్లి ఆశీస్సులతో తిరిగి వస్తుంటారు. గుహకు చేరేమార్గంలో బాణగంగ, చరణ పాదుక, హాథీమాథా (ఏనుగుతల) చరణగంగ అనే అంచెలంచెలుగా దాటవలసిన పవిత్ర స్థానాలున్నాయి. చరణగంగలో నీరు చాలా చల్లగా ఉంటుంది. అంత చల్లని నీటిలో దేవి దర్శనం కోసం వేచి ఉండవలసి ఉంటుంది.

వాల్మీకి రామాయణంలో స్వయంప్రభ అనే తపస్విని నివసించే గుహను గురించిన వర్ణన ఉంది. వైష్ణవదేవి వెలసిన గుహ కూడా

దాదాపు అలాగే ఉంటుంది. ఈ గుహకు సమీపంలో రామ మందిరం కూడా ఉంది.

భైరవుడనే రాక్షసుని సంహరించిన శ్రీ వైష్ణవి అతనికి మోక్షాన్ని ప్రసాదించింది. భైరవ మందిరం కూడా అమ్మణ్ణి ఆలయానికి కొంచెం దూరంలో ఉంది. దేవిని సేవించిన యాత్రికులు భైరవ దర్శనం కూడా చేసుకుంటారు.

అస్సాంలోని 'కామాఖ్యా' (కంచి కామాక్షిలాంటిదేవి) మందిరం కూడా ఇలాంటి మహిమగల శక్తి పీఠమే. గౌహాటీలో పాండుకు సమీపంలో పర్వత గుహకనిపిస్తుంది. కొండపైకి నడిచి వెళ్ళవచ్చు. ఇక్కడ పూజలు, సేవలు పూర్తిగా తాంత్రిక పద్ధతిలో ఉంటాయి. ఇది మన దేశంలోని పుణ్యక్షేత్రాలలో ఒకటి.

వైష్ణవదేవి గుహలాంటిది హిమాచల్ ప్రదేశ్‌లో మరోపుణ్యక్షేత్రం ఉంది. నిరంతరం ప్రజ్వలిస్తూ ఉండే జ్వాలాముఖిరూపంలో అక్కడ దేవి కనిపిస్తుంది. సుదర్శన చక్రం సతీ దేవి కళేబరాన్ని ఛేదించినప్పుడు దేవినాలుక ఈ క్షేత్రంలో పడిందట. కాబట్టి 51 శక్తి పీఠాల్లో ఇది ఒకటి అంటారు.

దేవి ఆలయం కొండమీద 50 మెట్లపైన నిర్మించబడి ఉంది. ఆలయంలో ఒక రాతికవాటం నుంచి చూస్తే జ్వాలామాలాకులమైన దేవికనిపిస్తుంది. దాదాపు రెండు చదరపుటడుగుల వేదికపై వెలుగుతున్న దేవికి పాలు, నెయ్యి తియ్యని పదార్థాలు నైవేద్యం పెడతారు. అక్బరు చక్రవర్తి అమ్మవారికి రజత ఛత్రం చేయించారట. ఆ ఛత్రం ఇప్పుడూ కనిపిస్తుంది.

# 13. అమృత్ సర్-అనంద్‌పుర్

గురువేదైవం, గురువాక్యమే తిరుమంత్రం, గురువును తెలిపే వాకిలే (గురుద్వారా) ఆలయం అని భావించి మానవ మాత్రులకు మంచిని పెంచేదే మతం అని ప్రచారం చేసిన గురునానక్ క్రీ.శ. 1497లో సిక్కుమతాన్ని స్థాపించారు. ఈశ్వరుడు అందరికీ ఒక్కడేననీ స్నానం, దానం, ధ్యానం ద్వారా అందరూ అతన్ని చేరుకోగలరనీ నానక్ బోధించారు. అలాంటి సిక్కులకు ప్రధాన కేంద్రం అమృత్‌సర్ లోని స్వర్ణమందిరం. దీన్ని హరి మందిరం అంటారు. ఆలయ శిఖరం వందకిలోగ్రాముల బంగారపు కప్పుతో కప్పబడివున్నందువల్ల దీనికి స్వర్ణమందిరమనే ఖ్యాతి వచ్చింది.

సిక్కుల మత గ్రంథం'గ్రంథ సాహిబ్' దీన్నే 'ఆది గ్రంథ్' అని కూడా అంటారు. సిక్కుల గురుపరంపరలో ఆది గురువు గురునానక్, పదిమంది గురువులు మతాచార్యులుగా ఈ సంప్రదాయాన్ని నడిపించిన తర్వాత పదవ గురువు గురుగోవింద సింగు 'ఇక నుంచి మన గ్రంథ సాహిబే' గురుపీఠాన్ని అలంకరిస్తుందనీ, మరి వేరే గురువక్కర లేదనీ నిర్ణయించారు. అప్పటి నుంచి గ్రంథ సాహిబ్‌ను 'గురుగ్రంథ సాహిబ్' అని వ్యవహరించి గ్రంథాన్నే గురువుగా దైవంగా పూజించటం ఆరంభమయింది. ఆచార పరులైన సిక్కులు తమయిండ్లలో ప్రత్యేకమైన గదిలో గ్రంథ సాహిబ్‌ని నెలకొల్పి నిత్యం పూజిస్తారు.

ఈ గ్రంథాన్ని కూర్చింది అయిదవ గురువు అర్జున్‌సింగ్. హరి మందిరంలో పూజింపబడేది కూడా ఈ ఆదిగ్రంథమే. హరి మందిరాన్ని 'దర్బార్ సాహిబ్' అని కూడా అంటారు. ఆలయంలో ప్రవేశించి ప్రదక్షిణం చేసేప్పుడు యాత్రికులకు గ్రంథసాహిబ్‌లోని గేయాలు నలుమూలలా వినిపిస్తూ ఉంటాయి. అలా పాడి వినిపించే వాళ్ళను గ్రంథీలు, రాగీలు అంటారు. నాలుగు చోట్ల వీళ్ళు కూర్చుని గురు గ్రంథాన్ని పారాయణం చేస్తూ ఉంటారు. ఈ గ్రంథ రాజంలో 3,500 గేయాలు ఉన్నాయి. ఇవి కేవలం సిక్కుమతస్థులు రచించినవే కావు. కబీర్, రామానంద్, నామ దేవ్ లాంటి మహనీయుల రచనలను కూడా ఇందులో చేర్చారు. ఇది ఒక విధంగా గురుసంహిత.

హరి మందిరం అమృత సరోవరం (అమృత్ సర్) అనే



నిర్మలమైన జలాశయం మధ్య నెలకొని వుంది. ఈ సరోవరాన్ని నాల్గవ గురువు గురు రామదాస్ క్రీ.శ. 1577లో నిర్మింప చేశారు. గురునానక్ మతస్థాపన చేసిన వంద సంవత్సరాలకు ఐదవ గురువు అర్జున్ దేవ్ ఈ సరోవరం మధ్య ఆలయం కట్టించి అందులో గురు గ్రంథ సాహిబ్‌ని ప్రతిష్ఠించారు. ప్రస్తుతం మనకు కనిపించే స్వర్ణ మందిరం సమగ్రరూపంలో మహారాజా రణజీత్ సింగ్ 1803లో కట్టించారు. తెల్లవారుజాము నుంచి రాత్రి 10,11 గంటలవరకు ఆలయంలో గురు సంకీర్తన జరుగుతుంటుంది.

ఆలయం చూచేందుకు వచ్చిన భక్తులకు శుద్ధ శాకాహారమైన భోజనం రెండు పూటలా గురు ప్రసాదం (లంగర్)గా పంచి పెడుతారు. ఆలయంలోకి ఉత్తర దిక్కు నుంచి ప్రవేశించాలి. కాలికి మేజోళ్ళు కూడా ఉండ కూడదు. తల మీద ఆచ్ఛాదన ఉండాలి. ఆలయంలో అడుగు పెట్టగానే ఎదురుగా హరిమందిరం కనిపిస్తుంది. పైన గోపురంలో సిక్కుమతానికీ గురువులకూ, త్యాగవీరులకూ సంబంధించిన ఆలయాలు కనిపిస్తాయి. ఇవి చూస్తే దేశమంతా చూచినట్టే అనిపిస్తుంది.

హరిమందిర్‌పై అంతస్తులో గురు గ్రంథ సాహిబ్ అఖండపారం జరుగుతుంటుంది. ఆపై అంతస్తులో అద్దాల మండపం ఉంటుంది. ఊరిబయట రామతీర్థ సరోవరం ఉంది. అదే వాల్మీకి ఆశ్రమం అంటారు. సీతాదేవి కుశలవులను ఇక్కడనే ప్రసవించిందని చెప్తారు.

స్వర్ణమందిరం తర్వాత ఆనంద పూర్ సాహెబ్ పట్టణంలో ఒక ప్రసిద్ధమైన గురుద్వారా ఉంది. సిక్కులకు ఇది చాల పవిత్రమైన క్షేత్రం. గురుతేజ్ బహాదూర్ ఈ క్షేత్రాన్ని స్థాపించారు. సిక్కుమతం నలుమూలల వ్యాపించటంలో ఈ గురుద్వారా చాలా దోహదమిచ్చిందంటారు.

# 14. హరిద్వారం-ఋషీకేశం

కైలాసవాసి శంకరుని జటాజూటం నుంచి వెలువడి భారత భూభాగంలో గంగానది అడుగు పెట్టిన పుణ్యక్షేత్రం హరిద్వారం. శ్రీ మహావిష్ణువు పాదాలనుంచి గంగ ప్రభవిస్తుందని అంటారు కాబట్టి ఆ హరిపదం చేరుకునేందుకు ఇది ద్వారం కనకనే దీన్ని హరిద్వారం అంటారు. ఇక్కడి నుంచే హిమాలయ పర్వతాలు ఆరంభమవుతాయి. మోక్షాన్ని ప్రసాదించే ఏడు పుణ్యస్థలాల్లో ఇది ఒకటి. పురాణాలు దీన్ని మాయాపురి అని కూడా వ్యవహరించాయి. హరిద్వారం పక్కన ప్రవహించే గంగ చాలా వేగంగా పంటకాలువలా పరుగిడుతుంది. సహజమైన గంగా ప్రవాహం పట్టణానికి కొంచెం దూరంలో 'నీలధార' అనే పేరుతో వెళుతుంది. యాత్రీకులు స్నానం చేసే రేవును 'హరికీపౌరీ' (హరిపాదం లేక విష్ణుపాదం) అంటారు. నిత్యం వేలకొలది యాత్రికులు ఇక్కడ స్నానం చేస్తారు. నది ఒడ్డున ఉన్న గోడల మీద హరిచరణ చిహ్నాలు కనిపిస్తాయి.

పన్నెండు సంవత్సరాల కొకసారి ఇక్కడ కుంభోత్సవం (కుంభమేలా) జరుగుతుంది. బృహస్పతి కుంభంలో ప్రవేశించిన తర్వాత సూర్యుడు మేషంలోకి వచ్చినప్పుడు ఈ మహోత్సవం జరుగుతుంది. లక్షల కొలది యాత్రీకులు ఈ ఉత్సవంలో పాల్గొంటారు. ప్రతిరోజు సాయంత్రం గంగా దేవికి హారతి ఇస్తారు. గంగాదేవి ఆలయం కూడా నది ఒడ్డున ఉంది. ప్రతి పూర్ణిమకూ, అమావాస్యకూ, ఏకాదశికీ, గ్రహణ స్నానానికీ ఇక్కడికి గుంపులు

గుంపులుగా జనం వస్తారు. గంగా తీరంలో చాలా ఆలయాలు, ఆశ్రమాలు ఉన్నాయి. సప్తర్షి ఆశ్రమం ముఖ్యంగా చూడదగింది. తపస్సులో మగ్నమయిన ఋషులకు ఇబ్బంది లేకుండా గంగా నది పాయలుగా ప్రవహిస్తుంది.

హారిద్వారానికి సమీపంలో దక్షప్రజాపతి పాలించిన చోట ఒక ఆలయం ఉంది. దక్షయజ్ఞం ఇక్కడే జరిగిందని అంటారు. ఇక్కడనే సతీ దేవి అగ్నిలో ఆత్మాహుతి చేసుకున్నదని చెప్తారు. ఈ ప్రాంతాన్ని 'కన్‌ఖల్' అంటారు స్నానానికీ తర్పణానికీ ఇది చాలా ప్రశస్తమైన చోటు.

ఎక్కువ మంది యాత్రికులు హారిద్వార్‌లో ఎక్కువ సేపు ఉండరు. గంగా స్నానం, తర్పణం లాంటి ముఖ్యమైన పనులు పూర్తికాగానే ఋషీకేశం వెళ్తారు. హారిద్వారం నుంచి 24 కి.మీ దూరంలో ఋషీకేశం ఉంది. దారిలో మనసామందిరం కూడా చూడదగిన ఆలయం. ఋషీకేశంలో గంగా జలం చాలా స్వచ్ఛంగా ఉంటుంది. వాతావరణం కూడా ప్రశాంతంగా ఉంటుంది. శివాలక పర్వతశ్రేణిలో చేరిన స్థానం కాబట్టి శంకరుని ముంగురులనుంచి చల్లని గాలి వీస్తూ మనస్సుకు హాయినిస్తుంది. అందుకనే కాబోలు ఇక్కడ ఆశ్రమాలు ఎక్కువ. ధ్యానానికి ఇది చాల అనువైన చోటు. 'లక్ష్మణ్ ఝూలా' అనే ఒక వంతెన ఋషీకేశం సమీపంలోనే ఉంది. రామలక్ష్మణ భరతాదులకు ఆలయాలు కూడా ఉన్నాయి. తిరుపతి దేవస్థానం వారు ఇక్కడ ఆలయాన్నీ, వసతిగృహాన్నీ కూడా ఏర్పాటు చేశారు.

# 15. దివ్యధామం హిమాలయం

ఆలయాలకు ఆలయం హిమాలయం. అన్ని ఆలయాలూ హిమాలయంలోనే ఉన్నాయి. అందరు దేవతలూ పర్వతరాజమయిన హిమాద్రిలో ఉన్నారు. అందుకే కాళిదాసు హిమాలయాన్ని 'దేవతాత్మ' అన్నారు. శ్రీ కృష్ణ పరమాత్మ 'స్థావరంగా ఉండేవాటిలో నేను హిమాలయాన్ని' అని అర్జునుడితో అన్నాడు. ఈ విషయం తెలియాలంటే హరిద్వారం దాటి హిమాలయంలో ఉన్న మంచుకొండలను, నదీమూలాలను, సహజంగా ప్రకృతి సిద్ధంగా వెలసిన దివ్యదేవతా మూర్తులను కళ్ళార చూడాలి. అందుకే యమునోత్రి, గంగోత్రి, కేదారనాథ్, బదరీనాథ్–ఈ నాలుగు ధామాలను చూచి తీరాలని యాత్రీకులు హరిద్వారంలోనే సంకల్పం చేస్తారు. వీటినే 'చార్‌ధామ్' అంటారు.

ఈ నాలుగు పుణ్యక్షేత్రాలు ఉన్న ప్రాంతాన్ని ఉత్తరాఖండమనీ, కేదార ఖండమనీ, దేవభూమి అనీ విజ్ఞులు అంటారు. ఈ హిమాలయ యాత్ర చేసే ముందు యాత్రికులు రామేశ్వరంలో రాముడు కట్టించిన సేతువు నుంచి కొంత ఇసుకను తీసుకొని వచ్చి దానిని హరిద్వారంలో గంగలో కలుపుతారు. తిరిగి వెళ్ళేప్పుడు గంగా జలం కొంత తీసుకుని వెళ్ళి దానితో రామలింగేశ్వరస్వామికి అభిషేకం చేస్తారు. ఇలా ఆసేతు హిమాచలాన్ని ఆధ్యాత్మికంగా సమ్మిళితం చేయటం భారతీయుల సమైక్యభావాన్ని తెలియ పరుస్తుంది. ఇదే తీర్థ యాత్రలలోని పరమార్థం.

హరిద్వారంలో చేసిన సంకల్పం ఋషీకేశంలో కార్యరూపం ధరిస్తుంది. ఈ యాత్రలో మొదటి మెట్టు యమునోత్రి. యమునోత్రి నుంచి గంగోత్రి, గంగోత్రి నుంచి కేదారనాథ్, కేదారనాథ్ నుంచి బదరీనాథ్ వెళ్ళి తిరిగి ఋషీకేశం రావటం పరిపాటి. నాలుగు ధామాలూ తిరిగివచ్చేందుకు కనీసం 10-15 రోజులు పడుతుంది. ప్రయాణ సౌకర్యాలు, వాతావరణం బట్టి ఉంటుంది.

సప్తర్షి కుండం యమునకు ఉద్గమస్థానం. కొండ మీద సప్తర్షి కుండం ఉంది. కొండ క్రింద యమునోత్రి మందిరం ఉంది. మందిరంలో నల్లని యమున, తెల్లని గంగ దేవతామూర్తులుగా ఉంటారు. కొండపైకి ఎక్కి నదీమూలాన్ని చూడాలి. అత్రి, భరద్వాజ, వసిష్ఠ, విశ్వామిత్ర, గౌతమ, జమదగ్ని, కశ్యప మహర్షులు ఇక్కడ తపస్సు చేశారట. యమునోత్రి మందిరం దగ్గర సూర్య కుండం ఉంది. ఇక్కడ నీళ్ళు సలసల కాగుతూఉంటాయి. యాత్రీకులు బియ్యం, ఉర్ల గడ్డలను గుడ్డలో చుట్టి నీటిలో కొద్ది నిమిషాలు ఉంచేసరికి అన్నం, కూర తయారవుతాయి. దీనికి సమీపంలో ఉన్న దివ్య శిలను సేవించిన తర్వాతనే యమునా నదికి పూజ చేస్తారు.

నదులు పుట్టిన క్షేత్రం ఎంత పవిత్రమయిందో, నదులు కలిసే చోట కూడా అంత పవిత్రమైనదే. ఇలాంటి నదీ సంగమాలను హిమాలయ వాసులు 'ప్రయాగ' అని అంటారు. భాగీరథి, అలక నంద కలిసే చోటును దేవప్రయాగ అంటారు. ఇక్కడికి సమీపంలో రఘునాథ మందిరం ఉంది. స్వామి విగ్రహం 15 అడుగుల పొడవు గలిగి ఉంటుంది. వైష్ణవులకు ఆరాధ్యక్షేత్రాలయిన 108 దివ్యదేశాలలో ఇది కూడా ఉంది.

అలాగే అలకనంద మందాకినితో కలిసే చోటును 'రుద్రప్రయాగ' అని అంటారు. కర్ణప్రయాగ నందప్రయాగ విష్ణు ప్రయాగ కూడా ఇలాంటి నదీసంగమాలే. వీటన్నిటిని

చూచుకుంటూ నాలుగు ధామాలను సేవించవచ్చు.

యమునోత్రి తర్వాత గంగోత్రికి వెళ్ళాలి. భగీరథుడు గంగా వతరణం కోసం తపస్సు చేసిన భగీరథశిల ఇక్కడ కనిపిస్తుంది. గంగోత్రిలో చూడవలసింది గోముఖం. గోముఖం నుంచే గంగ ఉద్భవించింది. గంగోత్రి దగ్గర గంగ ఉత్తర వాహినిగా ప్రవహిస్తుంది. అందుకే యీ క్షేత్రాన్ని గంగోత్తరి లేక గంగోత్రి అంటారు. కాశీలో కూడా గంగ ఉత్తర వాహిని, గంగ ఆవిర్భవించిన చోట ఎలుగెత్తి పలుకుతూ ప్రవహిస్తుంది. ఆ నినాదం చాలా శ్రావ్యంగా, దృశ్యంగా, ప్రసన్నంగా ఉంటుంది. గంగోత్రి మందిరం దృశ్యంగా, ప్రసన్నంగా ఉంటుంది. గంగోత్రి మందిరం అక్షయ తృతీయ (వైశాఖ శుద్ధ తదియ) నాడు తెరుస్తారు. దీపావళికి మూసేస్తారు. చలికాలంలో ఆలయం మంచుతో కప్పబడి వుంటుంది. అసలు గోముఖం హిమరాశి. ఇక్కడి నుంచి కేదారనాథ్ వెళ్ళేదారిలో ఎందరో మహర్షులు తపస్సు చేసిన 'తపోవనం' పాండవులకు చిక్కకుండా శంకరుడు తనను తాను దాచుకున్న 'గుప్తకాశీ', పార్వతీ పరమేశ్వరుల పరిణయం జరిగిన 'త్రియుగీ నారాయణ్' కని పిస్తాయి. కృతయుగంలో జరిగిన వివాహ సమయంలో ప్రజ్వలించ బడ్డ అగ్ని హోత్రం మూడు యుగాలు అలాగే ఉంటుందని దేవతలు శాసించారు. ఈ అగ్ని కుండంలో కొయ్య ముక్కలు వేసి భస్మాన్ని ప్రసాదంగా గ్రహిస్తారు.

కేదారనాథ్ గంగోత్రి నుంచి బదరీనాథ్ వెళ్ళే దారిలో ఉంది. ప్రక్కనే మందాకిని ప్రవహిస్తూ ఉంటుంది. ఇక్కడ ఉన్న కేదారనాథ మందిరాన్ని పాండవులు నిర్మించారని అంటారు. ఇది పన్నెండు జ్యోతిర్లింగాలలో ఒకటి. శంకరాచార్యులు ఈ ఆలయాన్ని పునరుద్ధరించి దీనికి చక్కని రూపాన్ని ఇచ్చారు. భారతదేశంలోని శివాలయాల్లో దీనికి ప్రత్యేకమైనస్థానం ఉంది.

జగద్గురువులు ఇక్కడనే సిద్ధి పొందారని కూడా అంటారు. పాండవులకు శంకరుడు ఇక్కడ వృషభ రూపంలో సాక్షాత్కరించారనీ, భీముడు ఆ యెద్దుతోకను పట్టుకుంటే శంకరుడు అక్కడ కేవలం పిండరూపంలో వెలిసి మిగిలిన నాలుగు రూపాలను నాలుగు చోట్ల వెలయించాడనీ అంటారు. వాటినే పంచకేదారాలంటారు. బాహువులు తుంగనాధుడిగా ముఖం రుద్రనాథుడిగా, జటాజూటం కల్పేశ్వరుడిగా, నాభి మధ్యమహేశ్వరుడిగా వెలయగా పిండరూపం మాత్రం కేధారనాథ్‌లో ఉండి పోయింది. కొంత మంది యాత్రికులు ఓపిక చేసుకుని యీ పంచకేదారాలను దర్శిస్తారు.

కేదారనాథ్ నుండి బదరీనాథ్ వెళ్ళే దారిలో జోషీమఠం ఉంది. చలికాలంలో బదరీ విశాల్ మంచుతో నిండినప్పుడు అక్కడి అర్చకులు జోషీమఠంవచ్చి బదరీనారాయణుని ఉత్సవ మూర్తికి పూజచేస్తారు. అక్కడ చాలా ప్రాచీనమైన వాసుదేవాలయం కూడా ఉంది. శంకరాచార్యులు స్థాపించిన నాలుగు పీఠాలలో ఒకటి జోషీమఠంలో ఉంది. ఇక్కడ ఒక కల్పవృక్షం క్రింద కూర్చుని ఆచార్యులవారు సమాధి దశలో సిద్ధిని పొందారని ప్రతీతి.

బదరీనాథ్ నరనారాయణులు తపస్సు చేసిన స్థలం. అయిదు వేల సంవత్సరాల క్రితం ఉద్ధవుడు ఇక్కడికివచ్చిన కాలానికే ఇది ప్రాచీన తీర్థం. భారతదేశంలోని ఎనిమిది స్వయం వ్యక్త క్షేత్రాలలో ఇది ఒకటి. శ్రీ కృష్ణుడు ఈ క్షేత్రాన్ని తన ఆశ్రమంగా ఉద్ధవుడికి పరిచయం చేసి అక్కడికి వెళ్ళి పవిత్రత పొందవలసిందని చెప్పాడట. నారదుడిలాంటి దేవర్షి కూడా ఈ క్షేత్రాన్ని సేవించి తరించినందువల్ల దీనిని నారదక్షేత్రమంటారు. శంకరాచార్యులే కాక రామానుజ, మధ్వాచార్యులు కూడా ఈ క్షేత్రాన్ని సేవించారట.

బదరీనాథ మందిరంలోని బదరీనారాయణ స్వామి విగ్రహం

రెండడుగుల యెత్తు శాలిగ్రామం. స్వామి పద్మాసనంలో ధ్యానముద్రలో కూర్చుని దర్శనమిస్తాడు. కుడివైపు ఉద్ధవుడు, నరనారాయణులు, నారదముని కనిపిస్తారు. ఎడమవైపు కుబేరుడు, వెండి వినాయకుడు ఉంటారు. గరుడుడు మోకాలి మీద కూర్చుని ఉంటాడు. శంకరాచార్యులకు వేరే ఆలయం ఉంది. ఆలయం సమీపంలో తప్తకుండ్, నారద కుండ్ అని రెండు జలాశయాలున్నాయి. వీటిలో స్నానం చేయటం మంగళకర మంటారు. దేవతలు కూడా బదరికానగరాన్ని చూచేందుకు వస్తారట. వాళ్ళు వచ్చే స్థలాన్ని దేవదర్శిని అంటారు. మందిరానికి కొంత దూరంలో అలకనందా తీరంలో బ్రహ్మకపాలం అనే రేవు ఉంది. ఇక్కడ పితృదేవతలకు పిండ ప్రదానం చేస్తారు.

బదరీనాథ్‌లోని ముఖ్య మందిరం బదరీ విశాల్ మందిరం కాక ఆది బదరి, వృద్ధ బదరి, భవిష్య బదరి, యోగధ్యాన బదరి అని మరి నాలుగు ఆలయాలున్నాయి. బదరి పరిసరాల్లో ఐదు జలపాతాలు కూడా ఉన్నాయి. వీటిని కూర్మ, ప్రహ్లాద, ఊర్వశి, భృగు, ఇంద్ర జలపాతాలంటారు. శేషనేత్రమనే పెద్ద బండరాయి కూడా ఇక్కడనే ఉంది. ఈ రాతిలో నుంచి ఆది శేషుడు అందరినీ పరిశీలించి చూస్తాడట.

నర నారాయణ పర్వతాలు ముఖ్యమందిరానికి వెనుక ముందులుగా ఉంటాయి. నీలకంఠ శిఖరం చాలా విచిత్రమైన పర్వత శిఖరం. సూర్యోదయం, సూర్యాస్తమయంలో దీని రంగులు మారుతాయి.

బదరి దర్శనంతో చార్ ధామ్ యాత్ర సమాప్తమవుతుంది.

## 16. కైలాస శిఖరం-కైవల్యధామం

పార్వతీ పరమేశ్వరుల నివాసస్థలంగా భావించబడే కైలాస శిఖరం (మౌంట్‌కైలాస్) శివ భక్తులకూ, హరి భక్తులకూ, దేశభక్తులకూ అందరికీ పరమ పవిత్రమైన పుణ్యస్థలం. సముద్రమట్టానికి 22,028 అడుగుల ఎత్తున ఉన్న యీ మంచు కొండ పరిధి 50 కి.మీ. హిందువులకూ, బౌద్ధులకూ కూడా సమానంగా ఆరాధ్యమైన కైవల్యధామమిది. జైనమతస్థులు కూడా దీన్ని తీర్థక్షేత్రంగా సేవిస్తారు. విశ్వవిఖ్యాతి చెందిన యీ మహోన్నత శిఖరం భువనాన్ని భవనం చేసుకొని మానవ జాతి గౌరవానికి మాన దండంగా నిలబడే అఖిలాచలం. ఆలయం కాని ఆలయం. మహాలయం. ఈ పవిత్ర శిఖరానికి 108 పర్యాయాలు ప్రదక్షిణం చేస్తే జన్మరాహిత్యంతో పాటు బ్రహ్మనిర్వాణం లభిస్తుందని ఆస్తికుల విశ్వాసం.

కైలాస శిఖరానికి 45 కి.మీ. దూరంలో సముద్రానికి 16 వేల అడుగుల ఎత్తున సుప్రసిద్ధమైన మానస సరోవరం (లేక మాన సరోవరం) ఉంది. సరోవరాలకు తలమానికమైన సరోవరం కావటం వల్ల దీన్ని మానసరోవరం అన్నా తప్పులేదు. మంచి మనిషి మనస్సు (సజ్జన మానసం) ఎంత నిర్మలంగా ఉంటుందో తెలుసుకునేందుకు ఆదర్శంగా కనిపించే మహోన్నత సరోవరం కాబట్టి దీన్ని మానస సరోవరం అని కూడా అనవచ్చు. అసలు 'మానసం' అంటేనే చాలు. నీటినుండి పాలను వేరుచేసి ఆరగించగల హంసలు ఇక్కడ పరమహంసల్లాగా విహరిస్తూ

ఉంటాయి. మానస పరిధి 80 కి.మీ. ఒక్కసారి చుట్టి వచ్చేందుకు అయిదారు రోజులు పడుతుంది.

ఈ సరోవరానికి సమీపంలోనే రావణాసురుడు తపస్సు చేసిన రాక్షస తలమనే జలాశయం ఉంది. మానస సరోవరం రామ చరిత మానసమయితే, రాక్షసతలం రావణ దశకంధరం అనుకోవచ్చు. అయోధ్యకు సమీపంగా ప్రవహించే సరయూనదికీ, కైలాస శిఖరం పక్కన ఉన్న యీ మానస సరోవరానికి ఏదో జలాను బంధం ఉన్నదని గాయత్రీమంత్ర ద్రష్ట విశ్వామిత్రుడు రామ లక్ష్మణులకు చెప్తాడు. భారతదేశంలోని 51 శక్తి పీఠాల్లో మానస సరోవరం కూడా ఒకటి. అమ్మవారి కుడి అరచెయ్యి ఇక్కడ పడిందంటారు.

కైలాస శిఖరం, మాన (స) సరోవరం రెండూ చాలా కష్టసాధ్యమైన యాత్రలు. అయినా యీ రెండు దివ్యక్షేత్రాలను దర్శించి వాటికి ప్రదక్షిణంచేసి నమస్కరిస్తేనే కాని శ్రద్ధా భక్తిసంపన్నులైన యాత్రికులకు తృప్తి ఉండదు.

దలైలామా నివసించే ధర్మశాల కూడా ఈ హిమాచల ప్రదేశ్‌లోనే ఉంది. అది కూడా చూడదగిన స్థలం. దలైలామా సామాన్యంగా మార్చి నెలలో తత్త్వబోధచేస్తారు. ఎన్నుకొన్న దారులు ఏవయినా చేరవలసిన తావు ఒక్కటే అన్నదే తత్త్వసారం.

# 17. ఆత్మలింగం-అమరనాథ్

కొండగుహాల్లో కొండలు తమకు తాము ప్రకృతిసిద్ధంగా కట్టుకున్న గుళ్ళకు ప్రసిద్ధిచెందింది జమ్మూ-కశ్మీర్. ఇంతకు ముందు వైష్ణవదేవి ఆలయాన్ని గురించి చెప్పుకున్నాం. మహాలక్ష్మి, మహాసరస్వతి, మహాకాళి-ఏకరూపమై వైష్ణవదేవిగా ఆ గుహాలో వెలసింది. అలాగే శ్రీనగర్‌కు 145 కి.మీ. దూరంలో అమరనాథ్ అనే శివక్షేత్రం ఉంది. వైష్ణవదేవిలాగా ఇది కూడా గుహాలయం. సముద్ర మట్టానికి దాదాపు 14 వేల అడుగుల ఎత్తున ఉన్న యీ గుహాలో ఎవ్వరూ ఏ విగ్రహాన్నీ ప్రతిష్ఠించలేదు. ఆలయం కట్టలేదు. సహజసిద్ధంగా ఏర్పడ్డగుహాలో శివలింగంలాంటి మంచుస్తూపం ఋతువుల మార్పుతో పెరుగుతూ తరుగుతూ ఉంటుంది. చంద్రకళలు క్షీణించే కొద్దీక్షీణిస్తుంది. శుక్ల పక్షంలో పెరుగుతుంది. కృష్ణ పక్షంలో తరుగుతుంది. శ్రావణ పూర్ణిమనాడు లింగం సర్వాంగ సౌష్ఠవంగా కనిపిస్తుంది. ఆ రోజు శివలింగాన్ని చూచేందుకు చాలామంది యాత్రికులు వస్తారు. అమరావతి అనే నదిలో స్నానం చేసి అమరేశ్వరుని హిమ మహిమను చూచి భక్తులు పరమానంద భరితులవుతారు. నూటయాభై అడుగుల ఎత్తు, 90 అడుగుల పొడవుగల గుహాలో అన్నింటికంటే ప్రశస్తంగా ప్రత్యేకంగా కనిపించే అమరలింగమే కాక వినాయకుడు పార్వతి భైరవుడు కూడా కనిపిస్తారు. వర్షాకాలంలోనే స్వామి దర్శనం. సంవత్సరంలో కేవలం రెండు నెలలు మాత్రమే ఆలయం యాత్రికులకు అందుబాటులో ఉంటుంది. సెప్టెంబరు నుంచి

జూన్ వరకు ఈ గుహాలయం మంచులో మునిగిపోతుంది. కుంభవృష్టిలో తడిసిపోయినా సరే శ్రావణ పూర్ణిమ అమరేశ్వరుని సాన్నిధ్యంలో గడప గలిగితే చాలునని యాత్రికులు అనుకుంటారు. హిమలింగంలోని మహిమ అలాంటిది. సామాన్యంగా యాత్రికులు శ్రావణ శుద్ధ ఏకాదశినాడు పహల్‌గావ్‌లో బయలుదేరి పూర్ణిమ నాటికి అమరధామాన్ని చేరకుంటారు. ఆత్మలింగాన్ని చూచి ఆత్మానందాన్ని అనుభవిస్తారు.

ఈ సందర్భంలో ఎల్లోరా గుహల్లో శిల్పకళా విశారదులు కొండల్లో చెక్కిన కైలాస మందిరాన్ని గురించి రెండు మాటలు చెప్పుకోవాలి. ప్రపంచంలో కొండను తొలచి చెక్కిన యింత విశాలమైన, కళాత్మకమైన మందిరం మరొకటి లేదనే చెప్పవచ్చు. అమరేశ్వరలింగం ప్రకృతి మాత ప్రసాదించిన విభూతి అయితే ఎల్లోరా గుహల్లోని కైలాస మందిరం శిల్పకళాకారులు, రూపొందించిన శివస్వరూపం. ఒకటిన్నర శతాబ్దం ఏడెనిమిది తరాల కళాకారులు అహర్నిశలు చేసిన కృషి ఈ కళాఖండంలో దాగి ఉంది. ఆలయంలో రామాయణ మహాభారతాలలోని ఘట్టాలను చిత్రించే శిల్పాలు కూడా ఉన్నాయి. దశావతారాలు చూడముచ్చటగా ఉంటాయి. కైలాస పర్వతం క్రింద రావణుణ్ణి నలిపి వేస్తున్న పార్వతీ శంకరులను చూచి తీరాలి. మంచు కొండలు చేసిన పనిని మనిషిగుహల్లో కూర్చుని చేశాడనిపిస్తుంది.

# 18. తీర్థంకరులు-తీర్థాలు

తాను తరించి ఇతరులను తరింప చేసేందుకు అర్హత గల మహనీయులను జైనసంప్రదాయంలో తీర్థంకరులంటారు. వీరు అవతరించి, సంచరించి, ప్రజలకు బోధించిన పుణ్యక్షేత్రాలను తీర్థాలనీ, తీర్థక్షేత్రాలనీ అంటారు. మొదటి తీర్థంకరులు ఋషభదేవులు లేక ఆదినాథులు అయోధ్యలో జన్మించారు. ప్రయాగలో కైవల్యజ్ఞానాన్ని పొందారు. కైలాస శిఖరం (మౌంట్ కైలాస్)లో నిర్వాణం చెందారు. కాబట్టి యీ మూడు స్థానాలూ జైనులకు తీర్థక్షేత్రాలే.

జైన సంప్రదాయంలో మొత్తం 24 మంది తీర్థం కరులున్నారు. చివరి తీర్థంకరులే సుప్రసిద్ధ మతప్రవక్త మహావీరులు. వీరు బీహారులోని కుందనగర గ్రామంలో క్రీ. పూ. 599లో జన్మించారు. విపుల పర్వత శిఖరంపై తొలి సందేశం ఇచ్చారు. క్రీ.పూ.527లో పాటలీపుత్రం దగ్గర పావాపురంలో నిర్వాణం చెందారు. పావాపురంలోని జలమందిరం మధ్య మహావీరుల చరణ చిహ్నాలపై చక్కని పాలరాతి మందిరం ఉంది. పరిసరాల్లో చాలా మందిరాలూ, ధర్మశాలలూ ఉన్నాయి.

జైన తీర్థక్షేత్రాలు నాలుగు విధాలుగా ఉంటాయి. మహనీయులు జన్మించిన స్థానాలను కల్యాణ క్షేత్రాలంటారు. సిద్ధిపొందిన స్థానాలను సిద్ధక్షేత్రాలంటారు. అద్భుతమైన సంఘటనలు జరిగిన చోట్లను అతిశయక్షేత్రాలంటారు. గొప్పగొప్ప మందిరాలు, కట్టడాలు, గుహలు ఏర్పరచిన చోట్లను కళాక్షేత్రాలంటారు.

అయోధ్యలో ఆది నాథులు కాక మరి నలుగురు తీర్థంకరులు జన్మించారు. బీహారులో హజారీబాగ్ జిల్లాలో ఉన్న సమ్మేద శిఖరం 20 మంది తీర్థంకరులకు సిద్ధి క్షేత్రమయింది. ఇది అనేకులకు తపోవనంగా ఉపకరించింది. జైనుల యాత్రస్థలాల్లో దానికి ప్రత్యేకమైన స్థానం ఉంది. ఈ శిఖరం చుట్టుపక్కలా, శిఖరం మీదా చాలా ఆలయాలున్నాయి. యాత్ర కొంచెం శ్రమసాధ్యమైనా యాత్రాకులు చాలా శ్రద్ధాభక్తులతో సకుటుంబంగా ఈ క్షేత్రాన్ని దర్శిస్తారు. సోనాగిరి లేక శ్రమణాచలం అనే పేరిట మధ్యప్రదేశ్‌లో ఒక సిద్ధక్షేత్రం ఉంది.

అతిశయ క్షేత్రాల్లో అన్నింటికి మించినదీ, ప్రపంచంలో అందరికీ తెలిసినది, ఒక విధంగా జైన తీర్థరాజం అని చెప్పదగినదీ **శ్రవణ బెలగొలం.** ఇది కన్నడదేశంలో మైసూరుకు 95 కి.మీ. దూరంలో ఉంది. ఆదినాథుని (మొదటి తీర్థం కరుల) కుమారుడు బాహుబలి విగ్రహాన్ని చూచేందుకు ముఖ్యంగా ఇక్కడికి వస్తారు. బాహుబలిని 'గోమటేశ్వర్' అని కూడా అంటారు. ఋషభ దేవునికి (అంటే ఆది నాథునికి) ఇద్దరు కూమారులు-బాహుబలి, భరతుడు. ఋషభదేవుడు రాజ్యపాలన చాలించి వనవాసం చేయసంకల్పించినప్పుడు ఇద్దరు కుమారులు రాజ్యం కోసం పోరాడారు. బాహుబలి గెలిచాడు. కాని రాజ్య భోగాన్ని త్యాగబుద్ధితో పరిత్యజించి భరతుడికి రాజ్యం ఇచ్చేశాడు. అలాంటి త్యాగమూర్తి బాహుబలి. ఈ త్యాగమూర్తి విగ్రహాన్ని 58 అడుగుల ఎత్తు ఏకశిలామూర్తిగా నిర్మించి ఇక్కడ ప్రతిష్ఠించారు. ఈ శిలా విగ్రహం 24 కి.మీ. దూరం నుంచి కనిపిస్తుంది. ఇంద్రగిరి లేక వింధ్యగిరి అనే పర్వతంపైన ఈ విగ్రహం నెలకొని ఉంది. ప్రపంచంలో ఇంత పెద్ద శిలా విగ్రహం మరెక్కడ కూడా లేదంటారు.

పన్నెండు సంవత్సరాలకు ఒకసారి యీ విగ్రహానికి పాలతో,

నీటితో, చెరకు రసంతో, కుంకుమపువ్వుతో, చందనంతో, ఇంకా ఇంకా ఎన్నో పరిమళద్రవ్యాలతో బంగారు నాణాలతో మహామస్తకాభిషేకం చేస్తారు. ఈ మహోత్సవానికి భారతదేశంలో నలు మూలల నుంచే కాక విదేశాల నుంచి కూడా జనం విపరీతంగా వస్తారు. కాని అందరికీ అన్ని వసతులూ చక్కగా చేస్తారు. అది ఒక మహాయజ్ఞం. క్రీ.పూ. మూడవ శతాబ్దంలో చంద్రగుప్త మౌర్యుడు తన గురువుగారయిన భద్రబాహువుతో కలిసి యీ క్షేత్రాన్ని దర్శించారట.

విగ్రహం మస్తకస్థాయికి ఎక్కి అభిషేకం చెయ్యాలంటే 470 అడుగుల వరకు పరచిన ఆరు వందల మెట్లు ఎక్కాలి. ఈ విగ్రహం 1800 సంవత్సరాల క్రితం తయారు చేయబడింది. 1993లో ఈ మహా మస్తకాభిషేకం జరిగింది. మళ్ళీ 2005లో జరగబోయే అభిషేకం కోసం అందరూ ఎదురు చూస్తున్నారు.

హిందువులకు ప్రశస్తమైన పుణ్యక్షేత్రాలైన అయోధ్య, మధుర, కాశీ, హస్తిన, కైలాస శిఖరం, ప్రయాగ జైనులకు కూడా అతిశయక్షేత్రాలు, సిద్ధక్షేత్రాలు కావటం విశేషం. కర్ణాటకలో ధర్మస్థలం అనే పుణ్యక్షేత్రం మధ్వలకూ, జైనులకూ సమానంగా ఆరాధ్యమయింది. ఈ ఆలయంలో పూజారులు మధ్వలు, మధ్వ సంప్రదాయం ప్రకారం పూజలు జరుగుతాయి. కాని ఆలయంలో ఏర్పాట్లన్నీ జైన ధర్మకర్తలు నిర్వహిస్తారు. ఈ క్షేత్రాన్ని చూచేందుకు వచ్చిన యాత్రీకుల కందరికీ భోజన వసతులు ధర్మకర్తలే చేస్తారు. ఇటీవల ఇక్కడ 12 మీటర్ల ఎత్తు బాహుబలి ప్రతిమను కూడా స్థాపించారు. పరస్పర సహకారంతో వేరు వేరు మతాల వారు ఇలా మానవసేవ చేయటం ప్రశంసనీయం, అనుకరణీయం.

ఎల్లోరా గుహల్లో కూడా హిందువుల ఆలయాలూ, జైన బౌద్ధుల కళాక్షేత్రాలూ కలిసి ఉండటం విశేషం. సారనాథ్ బౌద్ధులకు ఎంత ప్రాముఖ్యం గల స్థలమో జైనులకు కూడా అంతే. మొదటి

తీర్థంకరుల జన్మస్థానం (అయోధ్య), కైవల్య జ్ఞాన ప్రాప్తిస్థానం (ప్రయోగ), నిర్వాణ (సిద్ధి) స్థలం (కైలాస శిఖరం-మౌంట్ కైలాస్) మూడూ హిందువులకు ఆ రాధ్య క్షేత్రాలు కావటం గొప్ప విశేషం. ఖజురాహోలో కూడా పడమర వైపు అన్నీ హిందువుల మందిరాలూ తూర్పు వైపు జైన తీర్థాలూ కనిపిస్తాయి.

ఖజురాహోలోని మూడు జైన మందిరాల్లో పార్శ్వనాథ మందిరం (10 వశతాబ్దం నాటిది) అన్నిటి కంటె పెద్దది చాల గొప్పగా ఉంటుంది. ఈ ఆలయంలోని గొప్పవిశేషవేమిటంటే ఇందులో వైష్ణవులకు ఆరాధ్యులైన దేవతల శిల్పాలు గుడి గోడలపై చెక్కబడి ఉన్నాయి. అసలిది మొదటి తీర్థంకరులైన ఆదినాథ్‌కు కట్టిన దేవాలయం. కాని 1860లో పార్శ్వనాథ ప్రతిమ గర్భగుడిలో చేర్చబడింది అలాగే శాంతినాథ మందిరంలో ఆదినాథ విగ్రహం కూడా కనిపిస్తుంది.

ఈ జైనమందిరాలకు ఉత్తరంవైపు బ్రహ్మగుడి, వామనాలయం (10,11శతాబ్దాలవి) కూడా ఉన్నాయి. దీనిని బట్టి జైన, బౌద్ధ హిందూమతాలలో ఆనాటి సమరస భావం చక్కగా విశదమవుతుంది.

జైన గుహాలయాల్లో చెప్పుకోదగినవి : పాట్నాకు సమీపంగా ఉన్న రాజగీర్ (రాజగృహం)లోని సోనభద్రగుహాలయాలు. ఇవి రెండు వేలసంవత్సరాల క్రితంవి. ఇవి కాక విపుల, రత్న, ఉదయ, స్వర్ణ, వైభార-అనే అయిదు పవిత్ర శైలాలు కూడా చాలా ప్రాచీనమయినవి. వీటిలో విలువగల క్షేత్ర సామగ్రి ఉంది. యాత్రికులకు ఇది చాలా జ్ఞానవర్థకము, ఆకర్షణీయమైన క్షేత్రం.

ఉదయగిరిలో రాణీగూఫా గుహలు, రాజస్థాన్ (చిత్తోడ్)లోని కీర్తి స్తంభం, ఆబూ శిఖరంలోని జైన మందిరాలు చాలా ప్రసిద్ధి కెక్కినవి. బికనేర్‌లోని సరస్వతీ విగ్రహం ఎంతో అందంగా ఉంటుంది. ఢిల్లీలోని నేషనల్ మ్యూజియంలో ప్రవేశించగానే ఈ విగ్రహం చిరునవ్వుతో అతిధులకు స్వాగతం పలుకుతుంది.

# 19. బౌద్ధుల పుణ్యక్షేత్రాలు

జైన తీర్థంకరులలో పరిణత ప్రజ్ఞాలైన చివరి తీర్థంకరులు-వర్ధమాన మహావీరులూ (క్రీ.పూ 599-557) బౌద్ధమత ప్రవక్త అయిన గౌతమ బుద్ధుడూ సమకాలికులు కావటం భారతీయుల ఆధ్యాత్మిక చరిత్రలో చెప్పుకోదగ్గ ఘట్టం. తీర్థంకరులు సాధించిన ఆత్మవైభవాన్ని ధర్మపరంగా సంఘసమ్మతంగా ముందుకు సాగించిన బోధిసత్త్వుని తథాగత తత్త్వచింతనను హిందువులు అంగీకరించి దశావతారాల్లో బుద్ధ భగవానుణ్ణి చేర్చటం అంతకంటే ఆనందించవలసిన విషయం.

కాశీకి సమీపంలోని సారనాథ్ బుద్ధ దేవుని తొలిసందేశాన్ని ప్రసారించింది. గయలోని బోధివృక్షం ధర్మపదానికి తొలిపలుకు పలికింది. ఈ రెండు క్షేత్రాలు కూడా హిందువులకు పరమపావనమైన తీర్థాలు. ఈ రెంటిని గురించి మనం ఇంతకు ముందే తెలుసుకున్నాం. ఈ నాడు బౌద్ధమతం మన దేశంలోనే కాక దేశ దేశాంతరాల్లో ప్రబుద్ధులకు సద్బుద్ధిని ప్రసాదిస్తున్నది. భారతదేశం స్వతంత్ర భారతం కాగానే సారనాథ్‌లోని అశోక చక్రం, నాలుగు సింహాలు జాతికి చిహ్నాలయ్యాయి. సాంచీలో కూడా ఈ స్తూపంలాంటి స్తూపం కనిపిస్తుంది. అంతే కాక క్రీ.పూ. మూడవ శతాబ్దం నుంచి 13 వ శతాబ్దంవరకు ఏర్పడిన బౌద్ధ శిల్పాలు, స్మృతి చిహ్నాలు ఇక్కడ కనిపిస్తాయి. అశోక చక్రవర్తి స్థాపించిన యీ మహాస్తూపానికి నాలుగు వైపులా నాలుగు తోరణ

ద్వారాలున్నాయి. ప్రతి ద్వారంలో ధ్యాన ముద్రలో ఉన్న బుద్ధ విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. సాంచీ బుద్ధ భగవానుని జీవితంతో ప్రత్యక్షంగా సంబంధించింది కాక పోయినా అక్కడి శిల్ప సౌందర్యం, భక్తి తాత్పర్యం ప్రపంచంలో మరెక్కడా కనిపించదు.

ముంబయికి 40 కి.మీ. దూరంలో 109 బౌద్ధ గుహాలున్నాయి. వీటిలో అన్నిటికంటె ఆకర్షణీయమైన చైత్యమందిరం (సంఖ్య : 3) లో 21 అడుగుల పొడవుగల రెండు బుద్ధ విగ్రహాలున్నాయి. ఒక గుహానుంచి సముద్రం చాలా చక్కగా కనిపిస్తుంది. ఎలిఫెంటా వెళ్ళినవాళ్లు ఈ గుహాలను కూడా దర్శించవచ్చు.

నాసిక్ నుంచి కొంత దూరంలో హీనయాన బౌద్ధులు నిర్మించిన ఆలయాలు, గుహాలు, విహారాలు ఉన్నాయి. వీటిని పాండవ గుహాలంటారు. దాదాపు రెండు వేల సంవత్సరాల క్రితం నిర్మించినవివి. వీటిని చూస్తుంటే అజంతా గుహాలు జ్ఞాపకం వస్తాయి. బౌద్ధమతానికి సంబంధించిన 24 గుహాల్లో 3, 8, 15 సంఖ్యగల గుహాలు తప్పక చూడవలసినవి. ఔరంగాబాదు గుహాల్లో కూడా చాలా బౌద్ధమతానికి సంబంధించినవే.

అజంతాలోని అద్భుత శిల్ప సౌందర్య మంతా బౌద్ధగుహాలదే. మొత్తం 30 గుహాలు క్రీ. పూ. 200 నుంచి క్రీ.శ. 650 వరకు నిర్మించిన కళాఖండాలు. ఇందులో కొన్ని మహాయానానికి చెందినవి. కొన్ని హీనయానానికి చెందినవి. ఇంత మహత్తరమైన శిల్ప చాతుర్యం క్రీ.శ 1819 వరకు ఎవరి కంట పడకుండా మరగుపడిఉంది. ఆంగ్లేయులు కొందరు వేటకోసం ఈ ప్రాంతానికి వచ్చి విశ్రమించినప్పుడు ఉన్నట్టుండి వాళ్ళ దృష్టి ఈ గుహాలవైపు మళ్ళింది. ఆ తర్వాత ఇవన్నీలోకపు వెలుగును చూచాయి. ఆంధ్రదేశంలో అమరావతి అనే శివ క్షేత్రం దగ్గర అలాంటి బౌద్ధ గుహాలు కొన్ని ఉన్నాయి. ఒక పెద్ద బౌద్ధ స్తూపం కూడా ఉంది. దాన్ని చూచేందుకు దేశదేశాంతరాల నుంచి బౌద్ధులు

వస్తారు. ఆ శిల్పాలను చెక్కిన వాళ్ళే అజంతా గుహాలను నిర్మించారంటారు. ఏ నాడో సృష్టించిన వర్ణచిత్రాలు ఈ నాటికీ నిగనిగలాడుతూ కనిపించటం ఆశ్చర్యం. మరి ఆ కళాకారులు ఎంత రస సిద్ధులో!!

ఎల్లోరాలో కూడా 12 బౌద్ధ గుహాలున్నాయి. ఇవి కాక 17 గుహాలయాలు హిందువులకు సంబంధించినవి. జైన గుహాలు కూడా ఇక్కడ అయిదున్నాయి. బౌద్ధ గుహాలన్నీ దాదాపు విహారాలే. చైత్యమందిరం ఒక్కటి మాత్రమే ఉంది. వేరు వేరు ఆకారాలలో, భావ ముద్రలలో బుద్ధ విగ్రహాలు ఈ గుహాల్లో కనిపిస్తాయి. ఒకానొక గుహ చాలా విశాలంగా ఉంటుంది. అది ఏ సభామండపమో లేక భోజనశాలో అనిపిస్తుంది.

ఈ గుహాలకు సమీపంలోనే ద్వాదశ జ్యోతిర్లింగాల్లో ఒకటయిన ఘుశ్మేశ్వరాలయం ఉంది. వివిధ మతాల సహజీవనానికి ఇది మరొక మచ్చుతునక.

బౌద్ధ పుణ్యక్షేత్రాలలో నలందా విశ్వవిద్యాలయానికి ఒక విశిష్టమైన స్థానం ఉంది. అయిదవ శతాబ్దంలో ఇంత గొప్ప విద్యాసంస్థ ప్రపంచంలో మరెక్కడా ఉండి ఉండదు. ఇదంతా బౌద్ధ పండితుల తపఃపరిపాకం. ప్రస్తుతం కేవలం శిథిలావశిష్టాలు ఉన్నాయి. ఇది బీహారు రాష్ట్రంలో ఉండటంవల్ల ఆ నాడీ పుణ్యభూమి మహామేధావులకు విహార భూమి అయింది. కోటి వ్రాత ప్రతులు సేకరించిన గొప్ప గ్రంథాలయం ఇక్కడ ఉండేది.

కేవలం బౌద్ధ సాహిత్యమే కాక వేదాంతం, వ్యాకరణం తర్కం, ఆయుర్వేదంలాంటి అనేక శాస్త్రాలు ఈ విశ్వవిద్యాలయంలో బోధించేవారు. బుద్ధభగవానులు, భగవాన్ మహావీర్ ఈ సంస్థకు విచ్చేసి దీనిని పావనం చేశారు. ఇంత మహత్తరమైన స్థలం ఈ శతాబ్దం ఆరంభం వరకు నిక్షిప్తంగా మరగుపడి ఉండటం విషాదకరం. 1916లో ఆరంభించిన త్రవ్వకాలు ఈ

విద్యావైభవాన్ని ప్రపంచానికి చాటి చెప్పాయి. ఇలా కాల గర్భంలో మరి ఎన్ని నిక్షేపాలు దాగివున్నాయో భవిష్యత్తే తెలియపరచాలి.

జైనులకు ఆరాధ్యమయిన రాజగిర్‌లోని సప్తపర్ణిగుహాలో తొలి బౌద్ధమత సమాఖ్య జరిగింది. అది బుద్ధ నిర్వాణం తర్వాత జరిగింది. బుద్ధ దేవుని వచానామృతాన్ని లిఫిబద్ధం చేయటం అప్పుడే ఆరంభమయింది. గృద్ధకూట పర్వతంలో గద్దలు, రాబందులూ తిరుగుతుండేవి. అక్కడ బుద్ధ భగవానులు తత్త్వ బోధచేశారు. వేణువనం కూడా తథాగతునికి తపోవనం అయింది జపాను దేశస్థులు ఇక్కడ విశ్వశాంతి స్తూప మందిరాన్ని స్థాపించారు.

బుద్ధ భగవానుని పరినిర్వాణం క్రీ. పూ. 383లో జరిగింది. వారి చివరి అనుగ్రహాభాషణం వైశాలిలో ఇవ్వటం జరిగింది. కాబట్టి లుంబినికీ, బోధగయకూ, సారనాథ్‌కూ ఉన్న ప్రాశస్త్యం వైశాలికి కూడా ఉంది. బౌద్ధ పుణ్యక్షేత్రాలు భారత దేశంలోనే కాక విదేశాలలో కూడా ప్రశస్తినీ, ప్రసిద్ధినీ పొందాయి.

## 20. ప్రార్థనా-మందిరాలు

ఆధ్యాత్మిక చింతనకు ఆలయాలే అవసరం లేదు. లోక కల్యాణం కోసం లోకేశ్వరుణ్ణి ఏ రూపంలో నైనా సరే మనసార ప్రార్థించి ఆ పరతత్త్వాన్ని ప్రపంచంలోని ప్రతి అణువులో చూడగలిగేతే అదే నిజమైన ఆరాధన అవుతుంది. క్రైస్తవులు చర్చిలో కూర్చుని ఏసుప్రభువును ప్రార్థించినా, మహమ్మదీయులు చంద్రతారలను స్మరిస్తూ అల్లాకు ఆత్మనివేదనం చేసేందుకు నియమనిష్ఠలతో 'నమాజు' చేసినా, ఏ మతాన్ని నమ్మినా, దేనినీ నమ్మకపోయినా-కనీసం తన మీద నమ్మకం ఉండి తన తోటి మానవులను ప్రేమతో చూచి ప్రేమస్వరూపుడయిన పరమాత్మను సేవ రూపంలో ధ్యానించినా అది పుణ్య కార్యమే అవుతుంది. అలాంటి మంచి పని జరిగేది పుణ్యక్షేత్రమవుతుంది.

ఈ దృష్టితో చూస్తే మన దేశంలోని క్రైస్తవ, మహమ్మదీయుల ప్రార్థనా మందిరాలు గొప్ప ప్రార్థనా కేంద్రాలని చెప్పవచ్చు. ప్రపంచం కలలో కూడా ఊహించలేని పురుషార్థం హృదయపూర్వకమైన ప్రార్థన ద్వారా సిద్ధిస్తుందని ఉపాసనాపరుడైన ఒకానొక ఆంగ్లకవి అన్నాడు. హిందువులకు గీత ఎంత పవిత్రమైన గ్రంథమో, సిక్కులకు గురు గ్రంథ సాహిబ్, క్రైస్తవులకు బైబిలు, మహమ్మదీయులకు కురాన్ అంత పవిత్రగ్రంథాలు. గురువును, మత ప్రవక్తనూ సాక్షాత్తూ దేవతా రూపంగా భావించి సేవించే గురుద్వారా, చర్చి, మసీదు పవిత్రమైన

ఆలయాలే అవుతాయి. భావన ప్రధానం. పరపీడన పరిహరించి పరోపకారం కోసం పాటు పడటమే నిజమైన మతనిష్ఠ.

ఇలాంటి ప్రార్ధనా మందిరాలలో గోవాలోని సెయింట్. కెథిడ్రల్ ప్రపంచంలో వున్న చర్చితో నయినా సరితూగ గలిగిన పెద్ద చర్చి. క్రీ.శ. 1553లో నిర్మించబడిన యీ చర్చిలో ఐదు గంటలున్నాయి. ఈ చర్చిలోని క్రీస్తు శిలువ మీద 1619లో ఏసుక్రీస్తు కనిపించారని అంటారు. అక్కడ మహామానవతావాది అయిన సెయింట్ ఫ్రాన్సిస్ గ్జేవియర్ భౌతిక కాయం ఇప్పటికీ భద్రంగా చెక్కు చెదరకుండా ఉంది. ఆ మహనీయుడు 1540లో గోవా వచ్చారు. 1552లో చైనాలో మరణించారు. భారతీయ



సాహిత్యంలో అది భక్తియుగం. ఏ దేశం నుంచి ఏ మతం వాళ్ళు వచ్చినా మనదేశం వాళ్ళకు స్వాగతం చెప్పింది. పోర్చుగీసు నావికుడైన వాస్కోడిగామా మనదేశానికి సముద్రమార్గాన్ని కనిపెట్టివస్తే ఆయన పేరిట మనదేశం ఒక పట్టణాన్ని ఏర్పరచింది.

ఆబూ శిఖరం మీద దిల్వారావద్ద పాల రాతి శిల్పంతో నిర్మించబడిన జైన దేవాలయాలు, ఢిల్లీలో ఇటీవల ఏర్పడ్డ కమలాకారంలో నయనాభిరామంగా ఉన్న బహాయి ప్రార్థనాలయం అన్నీ మన మత జీవితంలో కలిసిపోయాయి. మనదేశంలో చర్చి లేని నగరం, మసీదులేని పట్టణం లేదు. రామాలయం, శివాలయంలేని ఊరులేదు. అన్నింటినీ సమ దృష్టితో చూచి 'సర్వమున్ అతని దివ్యకళామయమంచు' భావించింది భారత భూమి. కనకనే దీనిని కర్మభూమి, పుణ్య భూమి అంటాం. కాశీవిశ్వనాథ మందిరం పక్కన ఉన్న ఔరంగజేబు మసీదు కూడా మనకు ఆదరణీయమే. తమిల్నాడులో సముద్రతీరంలోవున్న నాగూర్ మీరా సాహెబ్ దర్గా చాలా ప్రసిద్ధి కెక్కిన పుణ్యక్షేత్రం. అన్ని మతాల వాళ్ళూ ఈ దర్గాను సేవిస్తారు. బృహదీశ్వరాలయం ఉన్న తంజావూరు జిల్లాలోనే యీ దర్గా వుంది. మనకు దుర్గ ఎంత ఆరాధ్య దైవమో దర్గా కూడా అంతటి ఆదరణీయమైన దేవాలయమే.

అలాగే తంజావూరుకు 100 కి.మీ దూరంలో ఉన్న 'వేలాంకణ్ణి' అనే చర్చికి లక్షలాది హిందువులు వెళ్తారు. ఆరోగ్యమాత అని ప్రసిద్ధి చెందిన యీ పుణ్యక్షేత్రం రోమన్ క్యాథలిక్కులనే కాక తంజావూరు వానులకందరికీ ఆరాధ్యక్షేత్రం.

ముంబయిలోని హాజీఅలాదర్గా, కూడా అన్ని మతాలవారు

సేవించే పుణ్యస్థలం. 'అందరికీ ఆరాధ్య దైవం ఒకటే ' (సబ్ కామాలిక్ ఏక్ హై) అని ప్రపంచానికి చాటిచెప్పిన శిర్డీసాయి బాబాకు అన్నిమతాలలో భక్త బృందాలు ఉన్నాయి. అలాగే ఆంధ్ర కర్ణాటక సరిహద్దులో అభినవ నలందలా వున్న ప్రశాంతినిలయం సర్వధర్మసమన్వయాన్ని సాధిస్తూ మానవత్వాన్ని మతంగా రూపొందిస్తున్నది. సత్యం, ధర్మం, ప్రేమ, శాంతి అహింస మానవ జాతిని నిలబెట్టేందుకు అయిదువటవృక్షాలుగా భావించి తన పంచలో పంచవటిని స్థాపించిన సత్యసాయిబాబా ప్రపంచంలోని ప్రబుద్ధులను తన చెంతకు రప్పించుకుంటున్నారు.

మహాత్మా గాంధీ ఆశ్రమ భజనావళిలో అన్ని మతాల వారూ కీర్తించి తరించే భక్తిగేయాలను, శ్లోకాలను, మంత్రాలను చేర్చారు, 'ఈశ్వర అల్లా తేరేనామ్' (ఈశ్వరుడైనా అల్లా అయినా అందరూ



ఒకటే, అన్నీ నీ నామధేయాలే) అన్న తిరుమంత్రం ఈ శతాబ్దానికి దివ్య గానం అయింది-పూజ్య బాపూ ఆత్మబలం వల్ల ఆ నాడు వసిష్ఠమహాముని లోని బ్రహ్మతేజస్సును చూచి విశ్వామిత్రుడు ఎలా నిర్విణ్ణుడై 'ధిగ్బలం క్షత్రియబలం బ్రహ్మతేజో బలం బలం' అన్నడో, అలాగే ఈ శతాబ్దంలోని యుగ పురుషుడు గాంధీ మహాత్ముడు 'అర్ధ నగ్న ఫకీరు' గా కొల్లాయి గుడ్డతో తిరిగినా, ఆత్మ శక్తితో ఆయుధ శక్తిని ఎదుర్కొని సత్యధర్మాలను నిలబెట్టాడు. సత్యాగ్రహంతో స్వాతంత్ర్యాన్ని సాధించాడు.

మనకు స్వాతంత్ర్యం వచ్చి అర్ధ శతాబ్ద మయింది. మన దేశం, మన సంస్కృతి, మన సాహిత్యం మన ఆధ్యాత్మ దర్శనం తెలుసుకునేందుకు కనీసం ఇప్పుడైనా ప్రయత్నించాలి. 'మతాలు వేరయినా మానవులొకటే' అన్న మానవతామంత్రాన్ని జపించాలి. అప్పుడే మన పుణ్యక్షేత్రాలు పుణ్యతీర్థాలవుతాయి.

Laserset by Crystal Hues, South Ex. New Delhi-110049 and printed at JJ Offset Printer, Printing Press Area, Wazirpur, Delhi - 110 035